బాలానంద

# ఏసుక్రీస్తు మహిమలు

## [జీసెస్ నీతి కథలు]



రచన :

బూరెల సత్యనారాయణమూర్తి

నవరత్న బుక్ సెంటర్

ఏలూరు రోడ్ ........................ విజయవాడ-2

ప్రథమ ముద్రణ : జనవరి - 1999

వెల [illegible]

# ముందుగా ఏసు ప్రభువును గూర్చి

ఇశ్రాయేలు ప్రాంతమున-ప్రభు కుమారునిగా జన్మించిన యేసు ముప్పదిమూడు సంవత్సరములు జీవించినాడు. ఏసు అచటి ప్రజలను ప్రేమించుచు దైవ సేవ చేసినాడు.

ఏసు రోగిష్ఠులను బాగుచేశాడు.
అంధులకు చూపు నొసంగినాడు.
చెవిటివారికి బధిరత్వం తొలగించినాడు.
కుంటివారు బాగా నడచునట్లు చేసినాడు.
మూగవారు చక్కగా మాటాడ జేసినాడు.
అకాల మరణం చెందినవారిని బ్రతికించినాడు.
దయ్యాల (సాతానుల)ను పారద్రోలినాడు.
ఇట్లే ఆయన అనేక అద్భుతమైన మహిమలు చూపించినాడు.



ఏసు చూపించిన యీ అద్భుతమైన మహిమలను గాంచి ప్రజలు ఆయనను ప్రేమించారు. కూడా వెంబడించారు; కొంతమంది శిష్యులై ఆయన ప్రబోధాన్ని నలు మూలలా విస్తరింపజేశారు. ప్రజలు ఏసువైపు ఆకర్షితులు కావడం-మత గురువులను సహింపరానిదయ్యెను. అందువలన వారు పథకం ప్రకారం ఏసును బంధించి— రోమా ప్రభుత్వాధితులకు అప్పగించారు; కూట సాక్ష్యాలను ఇప్పించారు. జన సమూహాన్ని తమ పక్షానికి లాగుకున్నారు. ఏసుపై అనేక నిందారోపణలు వేయించారు.

సాక్ష్యాధారాలనుబట్టి రోమా ప్రభుత్వం అప్పటి వారి సాంప్రదాయాన్ని అనుసరించి ఏసుకు సిలువపై చంపుటకు మరణశిక్ష విధించారు.

ఏసు మరణం, పునరుత్థానం తర్వాత ఆయన శిష్యుల ద్వారా ఏసు మహిమలు లోకమునందు వ్యాపించినవి.

# జీసెస్ కథలు
## [ఏసుక్రీస్తు మహిమలు]

బాలల్లారా ! పాఠకులారా !
ఆలకించండీ మీరంతా
పాలకుడౌ మన జీసెస్ కథను
జాలము సేయక వినుడంతా॥

ప్రభువు కుమారుడైన ఏసుక్రీస్తు కథను ఆయనయొక్క పుట్టుక, ఆయన చేసిన లీలలు (మహిమలు) మీకు సూక్ష్మముగా తెలియజేస్తాను. భక్తి భావముతో, పరిశుద్ధ హృదయముతో ఆలకించండి ! ఏసుక్రీస్తునే "జీసెస్" అనికూడా అంటారు.

"ఏసు" అనగా రక్షించువాడు అని అర్థము.

"క్రీస్తు" అనగా దేవునిచే అభిషిక్తుడుగా పంపబడినవాడు అని అర్థము.

ఏసు ప్రభువుకు తల్లిదండ్రులు (మరియా, యోసేపులు) పెట్టిన పేరు "ఇమ్మానుయేలు" అనగా ప్రజలయొక్క పాపమును పోగొట్టువాడు అని అర్థము.

## రోమా దేశీయుల రక్షకుడు

ప్రభు కుమారుడగు "ఏసు" రోమాదేశీయుల యొక్క పాపములను తొలగించుటకు-వారలను కాపాడుటకు జన్మించాడు. ప్రభువుయొక్క కృపారసము

రోమా దేశంపై వెల్లివిరిసినందువల్ల ఆయన తన అంశమే అయిన "ఇమ్మానుయేలు"ను ఆ దేశీయులకు రక్షకుడుగా ఏసు నామమున జన్మింపజేశాడు. ఏసుక్రీస్తు పవిత్రవంతమైన "దావీదు" వంశములో జన్మించి రోమా దేశీయులందరికీ రక్షకుడైనాడు.

# క్రీస్తు వంశావళి

యిష్షయి కుమారుడగు దావీదు మహారాజు ఏసు ప్రభు వంశానికి మూల పురుషుడని చెప్పవచ్చును. ఈ దావీదు వంశములో అనేకమంది ప్రవక్తలు, మహా ప్రవక్తలు, ఉదార చరిత్రులు, మహాగుణ సంపన్నులు జన్మించారు. వీరిలో ప్రధానంగా చెప్పదగినవారు ఎవరనగా దావీదు తరువాత ఆయన కుమారుడు సాలోమన్, అతని కుమారుడు రెహబాము, ఇట్లే - కుమారుల వరుసక్రమంలో అబియా, అసాను, యెహోషాపాతు, యెహోవా, ఉజ్జియా, యోతాను, ఆహాజు, హిజ్కియా, మనష్షే, ఆమోను, యోషియా, యెకొన్యా, షయల్తీయేలు, జెరుబ్బాబేలు, అబీహూదు, ఎల్యాకీను, అజోరుసారో, అకీము, ఎలీహూదు, ఎలియాజరు, మత్తాయాకోబు, యోసేపు - ఇట్లు జన్మించారు.

# ఏసుక్రీస్తు జననం దేవదూత సందేశం

ఈ విధంగా దావీదు వంశమున జన్మించిన యోసేపునకు క్రీస్తు ప్రభువు కృపావరసమున "మరియ" అను భార్యయందు ఏసు జన్మించాడు.

ఏసు జన్మించి యిప్పటికి సుమారు రెండువేల సంవత్సరములయింది. ఆ కాలంలో రోమియులు ఇప్పుడు "ఇశ్రాయేలు"ను పరిపాలించేవారు. ఈ ఇశ్రాయేలు ప్రజలను "యూదులు" అని కూడా పిలిచేవారు.

ఏసుక్రీస్తు రోమాదేశమునకు చెందిన "గలిలియ" జిల్లాలో ఉన్న నజరేతు గ్రామములో యోసేపు మరియ దంపతులకు పుత్రుడైనాడు.

క్రీస్తు జననం మహావిచిత్రంగా జరిగింది. నజరేతు నగరంలో నివసిస్తున్న "మరియ" అను కన్యకకు దేవుడు "గాబ్రియేలు" అను దూత ద్వారా మరియకు ఒక శుభవార్తను పంపించాడు.

గాబ్రియేలు వెంటనే "మరియాసతిని" దర్శించి ఈ విధముగా చెప్పాడు.

"మరియమ్మా! ప్రభువు నిన్ను అనుగ్రహించాడు. ఆయన తన కుమారుని నీ గర్భమున ఉదయింప చేస్తున్నాడు. ఆ కుమారుడు క్రీస్తునామముతో పిలువబడుతాడు. ఈ లోకములోని పాపులను ఉద్ధరిస్తాడు. మంచివారికి ఉన్నతమైన గౌరవమును ప్రసాదిస్తాడు" అని తెలియజేశాడు.

ఆ దేవదూత మాటలు విని మరియ ఎంతో ఆశ్చర్యపడింది. ఆనందమూ చెందింది. అప్పటికి మరియ కన్యే. యోసేపు అను దావీదు వంశంలోని వానితో వివాహానికి ప్రదానం చేయబడింది. అందుకే ఆమె చాలా ఆశ్చర్యపడింది. "నేను యింకను కన్యను. వివాహం కాలేదు. నా గర్భమున కుమారుడు ఎట్లు పుట్టును ?" అని సంశయించింది.

దేవదూతయగు గాబ్రియేలు యిలా అన్నాడు.

"మరియమ్మా, నీవు అనుమానపడవద్దు; భయం ఎంతమాత్రమూ చెందనవసరం లేదు. నీవు తప్పక భగవంతుని కృపతో కుమారుని పొందుతావు. ఆ బాలునికి మీరు "ఇమ్మానుయేలు" అను పేరు పెట్టుతారు. ఆ బాలుడే యేసుక్రీస్తుగా కీర్తి చెందుతాడు. అందువలన మీరు మీ వంశీయులు గొప్ప గౌరవాన్ని

పొందుతారు. ఆ బాలుడు ఎవరనుకుంటున్నావు ? అతడు లోకరక్షకుడగు దేవుని కుమారుడు దేవుని కుమారునిగానే అతడు అందరిచేత గౌరవంగా పిలువబడతాడు. ఆ బాలుడే తన పితృవంశీయుడగు దావీదువలె కీర్తి చెందుతాడు. ఆ విధంగా దేవుడు క్రీస్తును ఆశీర్వదిస్తాడు. అతనిని రాజుగా కూడ చేస్తాడు. అతడు ఇశ్రాయేలీయులాదరకు రాజుగా ఉంటాడు. ఆయన పాలనలో అందరునూ సుఖిస్తారు. ఆయన పాలన సూర్యచంద్రులు ఉన్నంతవరకూ ప్రకాశిస్తుంది" అని పలికాడు.

అందుకు మరియామాత ఆనందం చెందింది. కానీ సంశయం కూడ కలిగింది. "నేను యింకను కన్యకను గదా! పెండ్లిగూడ కాలేదుగదా ! యోసేపుతో వివాహం నిశ్చయం అయిందిగాని, వివాహం కాలేదుగదా ! మరి నాకు పుత్రుడు పుడితే ఆయన నన్ను వివాహం చేసికొంటాడా ? ఇదంతా ఎలాసాధ్యం అవుతుంది? లోకులు నన్ను ఎంత అపవిత్రంగా చూస్తారు" అను సంశయాలు ఎన్నో కలిగినవి. అందువలన ఆ మరియామాత దేవదూతను చూచి "దేవునిచే పంపబడిన ఓ మహానుభావా ! నేను యింకను కన్యకనే. నాకు వివాహమే కాలేదు. ఇదంతా ఎలా సాధ్యమవుతుంది ? నేను నిందపడకుండా ఎలా ఉండగలుగుతాను ?" అని ప్రశ్నించింది.

అందుకు దేవదూత చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. "అమ్మా ! నీకు ఏ నిందా కలుగదు. భగవంతుని యొక్క పరిశుద్ధాత్మ నీలో ప్రవేశిస్తుంది. దేవుని యొక్క మహాశక్తి నీకు కలుగుతుంది. నిన్ను ఎవరూ అవమానింపరు. ఆ యొక్క మహిమలు ఎవ్వరూ తెలిసికోనంత మహిమలు గలవి. ఇందుకు నీకొక ఉదాహరణ చెబుతాను విను" అని ఆ దేవదూత మరియామాతకు "ఎలిజబెత్ కథను యీ విధంగా తెలియజేశాడు.

# దేవదూత చెప్పిన యోహాను జన్మచరిత్ర

"ఓ మరియామాతా! శ్రద్ధగా ఆలకించు. నీకున్న అనుమానాలన్నీ తొలగిపోతాయి" ప్రభువుయొక్క మహిమలు అనంతములు. అవి వర్ణింపశక్యము కానివి కూడ.

ఈ యూదయరాజ్యాన్ని హిరోదురాజు పాలిస్తున్నాడు. అతడు చాల దుర్మార్గుడు. హీనాతిహీనములైన గుణములు కలవాడు. ఆ హిరోదురాజు అన్న భార్యనే పెండ్లాడి, అతి నీచంగా రాజ్యం పాలిస్తున్నాడు. వాని దుశ్చర్యలను వెల్లడించి అతని మరణానికి దారితీసే ప్రబోధం చేసే ఒక మహాప్రవక్త కావలసి ఉంది. ప్రభువు అట్టి మహానుభావుని జన్మింపచేశాడు. అతడే యోహాను.

జకరయ్య ఒక యాజకుడు (గురువు). అతనిది అబియా యాజకవర్గము. మంచి గౌరవంగల సాంప్రదాయ మతనిది. అతని భార్యపేరు "ఎలిజబెత్". ఆమె కూడ మిక్కిలి పవిత్రవంతమైన అహరోను యాజకవర్గానికి చెందిన గృహములో జన్మించింది. వాళ్ళిద్దరూ ప్రభువు దృష్టిలో చాల మంచివారే. కాని, లోకుల దృష్టిలో "సంతానహీనులు", "గొడ్రాళ్ళు" అని పేరు పొందారు. వారికి సంతానంలేదు. అలాగే వారు యిద్దరూ గొడ్రాళ్ళుగానే చాలాకాలం అన్యోన్యంగా జీవించారు. జకరయ్యకు 70 ఏండ్లు వచ్చాయి. ఎలిజబెతుకు 60 ఏండ్లు నిండిపోయాయి.

అప్పుడు ఆ వయస్సులో ప్రభువు వారిని అనుగ్రహించాడు ఒకనాడు జకరయ్య ప్రభువు దేవాలయంలో గర్భగుడిలో ధూపం వేస్తున్నాడు. ఆ సమయంలో ప్రభువు పంపించిన దేవదూత జకరయ్యకు ప్రత్యక్షమైనాడు. అతనిని జూచి జకరయ్య భయభక్తులతో సాష్టాంగవందనం చేశాడు. ఆ దేవదూత జకరయ్యకు ప్రభువు. సందేశం యిలా వినిపించాడు. "జకరయ్యా! దేవుడు మీ దంపతులను

అనుగ్రహించాడు. మీకు పుత్రసంతతి అనుగ్రహించాడు. ఆ బాలుడు మహోన్నతుడై ఇశ్రాయేలు ప్రజలను ఉద్ధరిస్తాడు. ప్రవక్తగా వెలుగొందుతాడు. ప్రజలకు "బాప్తిస్తము" ప్రసాదిస్తాడు. ప్రజానీకమంతా ఆతని ప్రబోధంతో పునీతులవుతారు. అతడు మద్యపానీయములు సేవించడు. పవిత్రాత్మతో జీవిస్తాడు. తేనెను మాత్రమే ఆహారంగా సేవిస్తాడు. ప్రజలనందరినీ దేవునిదృష్టికి తెస్తాడు. అవిధేయులను విధేయులుగాచేసి సత్పథములోనికి మళ్ళిస్తాడు. ఆ బాలునికి "యోహాను" అని పేరు పెట్టండి. ఈ యోహానే ప్రభు కుమారునిగా లోకంలో ఆవిర్భవించిన ఏసుక్రీస్తుకు కూడా బాప్తిస్తమిచ్చి పవిత్రుడవుతాడు" అని సర్వమూ విశదీకరించాడు.

ఆ వాక్యాలను ఆలకించిన జకరయ్య ఎంతో ఆనందించాడు. అయినా తన వయస్సును, భార్య వయస్సును తలంచుకొని యిలా అడిగాడు. "మహాత్మా ! ఇది జరిగే పనియేనా ? మేమేమో వృద్ధులము అయిపోయాము. నాకు 70 ఏండ్లు. నా భార్యకు 60 ఏండ్లు నిండిపోయాయి. అందువలన మాకు అంతటి మహాభాగ్యం కలుగునా ? అని యోచిస్తున్నాను" అని తన సంశయాన్ని వెల్లడించాడు.

అప్పుడా దేవదూత : "జకరయ్యా ! నీవు సందేహింపకు. ప్రభువుకు నీపై మంచి అభిప్రాయం ఉంది. అది నా ద్వారా నీకు తెలియజేశాడు. ఈ శుభ సందేశం విని నీవు ఆనందించుటకు మారుగా సంశయాలకు లోనవుతున్నావు. దేవుని వాక్యము ఎప్పుడూ వృథాకాదు. నేనొకమాట చెబుతున్నాను. శ్రద్ధగా విను. నేను నీకు యిప్పుడు చెప్పిన మాటలు అన్నీ యదార్థము. నీకు నిదర్శనంగా నీకొక శిక్ష విధించుచున్నాను. అదేమిటంటే, నీకు కుమారుడు పుట్టువరకూ నీకు మాటలు రావు. నీవు మూగవలెనే సంజ్ఞలుచేస్తూ ఉంటావు. నీ కుమారుని నామకరణం జరిగే రోజే నీకు మరల మాటలు వస్తాయి"అని పలికి ఆ దేవదూత అదృశ్యమైపోయాడు.

జకరయ్యకు, దేవదూతకు యీ సంభాషణలు జరిగే సమయంలో ప్రజలు అందరూ దేవాలయం ఆవరణలో జకరయ్య రాక గురించి చూస్తూ ఉన్నారు. దేవ దూత వెళ్ళిన పిదప జకరయ్య వెలుపలికి వచ్చాడు. "ఇంతసేపు ఏమి చేస్తున్నావు గర్భాలయంలో ?" అని కొందరు జకరయ్యను ప్రశ్నించారు. కాని, జకరయ్య ఏమి చెప్పలేకపోయాడు. నోటివెంట మాట రాలేదు. సంజ్ఞలు చేయసాగాడు. జకరయ్యకు గర్భాలయంలో ఏదో మహత్తు జరిగి ఉంటుందని ప్రజలు భావించారు.

జకరయ్య తన పూజ ముగించుకొని యింటికి వెళ్ళాడు. భార్యయగు ఎలిజ బెత్తుకు సంజ్ఞల మూలంగాను, పలకపై వ్రాసికూడ జరిగినది తెలియజేశాడు. ఆమె ఎంతో ఆశ్చర్యం చెందింది; ఆనందంతో పొంగిపోయింది కూడ. "ప్రభువు నన్ను అనుగ్రహించి ఈనాటికి నన్ను సంతానవతిగా చేస్తున్నాడు. గొడ్రాలు అనే మాట తొలగిపోతుంది" అని ఆమె ఎంతో ఆనందంతో ప్రభువును స్మరించుకొంది.

ఎలీజబెత్తు సతి ప్రభువు ఆదేశానుసారంగా గర్భవతి అయింది. ఇప్పుడు ఆమెకు 6వ మాసం నడుస్తూఉంది. కావున ఓ మరియామాతా! ప్రభువుకు అసాధ్య మన్నది ఏదీ లేదు. నీవు ఆమెను చూడదలచుకొన్న వెళ్ళి దర్శించిరా. ఆ దంపతులు యూదయకొండ సమీపంలో ఉన్న గ్రామంలోనే ఉన్నారు. నీవు ఏమీ భయపడవ వద్దు. అనుమానం అంతకంటే వద్దు. నేను ఇప్పుడే నీకు ప్రదానం చేయుచున్న యోసేపు వద్దకు వెళ్ళి సర్వమూ తెలియజేస్తాను. అతడు దావీదు మహారాజు వంశంలో పుట్టినవాడు. విజ్ఞానం గలవాడు. మిక్కిలి నిదానం, ఓర్పు గలవాడు. ప్రభువు మాటలు నమ్మి తప్పక నిన్ను భార్యగా స్వీకరిస్తాడు. దేవుని కుమారుని

మీకు పుత్రుడు అవుతున్నాడు. మీరెంతో ధన్యాత్ములు" అని పలికి అదృశ్యమై పోయాడు.

## ఎలిజబెత్తును మరియామాత దర్శించుట

మరియామాత దేవదూత వెళ్ళిన తర్వాత చాలా ఆలోచించింది. నేను కన్యకను. ఇది ఎలా జరుగుతుంది ? భర్త యోసేపు నమ్మి తనను స్వీకరిస్తాడా ? దేవదూత మాటలు నమ్మకుండా ఎలా ఉండగలను? నమ్మకపోయినచో "జకరయ్యను మూగను చేసినట్లు నన్ను గూడ ఏమి చేయునో, అయినా నేను ప్రభువు సేవకు రాలను. ఆయన మాట ప్రకారం నడవడం నా ధర్మం. అదీగాక, దేవదూతయే ఎలిజబెత్తును చూచి రమ్మని సెలవు ఇచ్చాడు గదా! అని ఆలోచించి యూదయ కొండను ఆనుకొని ఉన్న ఆ గ్రామానికి బయలుదేరింది ఒంటరిగా.

యూదయకొండను ఆనుకొనియే ఆ గ్రామం ఉంది.మరియామాత ధైర్యంగా ప్రయాణం చేసి ఆ గ్రామం చేరుకుంది. జకరయ్య దంపతుల యిల్లు సులువుగానే ఆమెకు తెలిసింది. సంతోషంతో మరియ వారి యింటికి వెళ్ళింది. అప్పటికి ఆ దంపతులు పండ్లు భుజించుచున్నారు. మరియాను చూచి ఆనందంతో ఆహ్వానించారు. మరియా ఆ దంపతులకు నమస్కరించి కూర్చుంది. ఎలిజబెత్తును చూడగానే మరియా సందేహం తీరిపోయింది. ఎత్తుగా ఉన్న ఆమె గర్భాన్ని, ఆమె వయస్సును జూచి "దేవదూత" సత్యమే చెప్పాడు అని నమ్మింది. ఆ దంపతులకు దేవదూత తనకు చెప్పినదంతా చెప్పింది. ఆ దంపతులు ఆలకించి ఎంతో సంతోషించారు.

ఎలిజబెత్తు ఇలా అంది. "మరియమ్మా ! ప్రభువు నన్ను ఈ వయస్సులో అనుగ్రహించాడు. నలుగురిలో నన్ను తలయెత్తుకొని తిరిగేటట్లు చేశాడు. చూడు ! నీ మాటలు విని, నా గర్భములో ఉన్న యీ బాలుడుకూడ గంతులు వేస్తున్నాడు ఆనందంతో. నువ్వు ప్రభుకుమారునికి తల్లి వి కాబోతున్నావు. ఎంతో ధన్యురాలవు నీవు. ఇంతటి మహాభాగ్యం ఎవ్వరికీ లభించదు. ప్రభువాక్యం సత్యం అవుతుంది. నా కుమారుడు, దేవుని కుమారుడగు నీ కుమారునికి బాప్తిస్మము ఒసగి ధన్యుడవుతాడు" అని ఆశీర్వదించింది. మరియా సతి ఎంతో ఆనందంతో వారివద్ద సెలవు తీసికొని, తిరిగి యింటికి చేరుకుంది.

## యోహాను జన్మించాడు

క్రమంగా మూడు నెలలు గడిచాయి. ఎలిజబెత్తుకు 9 నెలలు నిండాయి. ఆమె ఒక శుభ సమయంలో మగపిల్లవానిని ప్రసవించింది. ఎలిజబెత్తు భర్త పేరే కుమారునికి పెట్టాలని అనుకుంది. కాని బంధువులు జకరయ్యను అడిగారు. జకరయ్య మూగకదా ! అందువల్ల ఒక పలకపై "యోహాను" అని పేరు పెట్టండి అని వ్రాసి చూపించాడు. బాలునికి "యోహాను" అని నామకరణం చేశారు. జకరయ్యకు మూగతనం వదలిపోయింది. దేవదూత చెప్పినట్లే జరిగింది. ఈ మహిమ అనగా జకరయ్యకు తిరిగి మాటలు రావడం, యోహాను జన్మించడం యూదయసీమలోని అన్ని గ్రామాలకు తెలిసిపోయింది. యోహాను మహానుభావుడు అవుతాడని - మనలనందరను కాపాడుటకు నీతిమార్గము ఉపదేశం చేస్తాడని, ఆ ప్రాంతంలో నివసిస్తున్న వారందరూ నమ్మారు.

# యోసేపు - దేవదూత

దేవదూత మరియామాతతో మాట్లాడిన తరువాత తిన్నగా పోయి యోసేపు వద్దకుపోయి ప్రత్యక్షమయ్యాడు. యోసేపు అతనిని జూచి విభ్రాంతుడయ్యాడు. భక్తితో నమస్కరించాడు.

దేవదూత యోసేపును జూచి యిలా అన్నాడు. "మహానుభావా! నీవు ధన్యుడవు. ప్రభువు నిన్ను అనుగ్రహించాడు. దావీదు మహారాజు వంశంలో జన్మించిన ధన్యుడవు, జ్ఞానవంతుడవు. ప్రభువు వద్దనుండి నీకొక సందేశము తీసికొని వచ్చాను. అదేమనగా : నీతో ప్రదానము గావింపబడిన మరియాసతి గర్భమున ప్రభు కుమారుడు - మీకు కుమారుడుగా జన్మిస్తాడు. పవిత్రురాలగు మరియాసతి మీ వివాహమునకు ముందే గర్భవతి అవుతుంది. ఇప్పుడామె గర్భవతియే. వివాహం కాక ముందే గర్భవతి అయిందని అనుమానించకు. నీవు ఏ అనుమానం చెందవద్దు, శంకించవద్దు, విడనాడవద్దు. ఆనందంతో ఆమెను స్వీకరించు. మీకు ప్రభుకుమారుడు జన్మిస్తాడు. "ఏసుక్రీస్తు" పేరున ప్రఖ్యాతి గాంచుతాడు. రోమన్ చక్రవర్తి ఆజ్ఞచే గవర్నరు మిమ్ము యూదయజిల్లాలోని బెత్లెహేము నగరానికి పిలిపిస్తాడు. దావీదు మహారాజు పుట్టిన స్థలమిది. ప్రభుత్వ జనాభా లెక్కలకు మిమ్ము అందరను అక్కడికి రమ్మని గవర్నరు ఆదేశిస్తాడు. మీరందరూ అక్కడకు వెళ్ళండి. ఆ బెత్లెహేము నగరంలోనే ప్రభుకుమారుడు మీకు జన్మిస్తాడు. కాబట్టి నీవు ఏ అనుమానం చెందకుండా మరియాసతిని వివాహం చేసికో!" అని తెలియజేసి దేవదూత అదృశ్యమైనాడు.

ఆ తరువాత కొద్దిరోజులకే యోసేపు - మరియాలకు వివాహం జరిగింది.

యోసేపు మరియా సతిని వివాహమాడినా, ప్రభు కుమారుడు జన్మించువరకూ ఆమెను పొందవలెను. చాలా గారాబంగా, ప్రేమగా, సుఖంగా ఉండునట్లు చూచు కున్నాడు.

# క్రీస్తు జననము

క్రమంగా మరియాసతికి నవమాసములు నిండినవి. ఆ సమయంలోనే ప్రభుత్వ జనాభా లెక్కల కొరకు స్వంత గ్రామాలకు రావలసినదని రోమా చక్రవర్తి ఆజ్ఞ అయింది. అప్పటికి నెలలు నిండినప్పటికి యోసేపు - గలిలియా జిల్లాలో ఉన్న నజరేతు గ్రామం నుండి బెత్లెహేముకు భార్యతో బయలుదేరాడు. బెత్లెహేము యూదయ జిల్లాలో ఉంది అది దావీదు. మహారాజు పుట్టిన చోటు.

యోసేపు దావీదు వంశీయుడు కాబట్టి తప్పక బెత్లెహేముకు వెళ్ళాలి. అక్కడ తమ పేర్లు జనాభా లెక్కలలో వ్రాయించుకోవాలి. అందువల్ల యోసేపు మరియా సతితో బెత్లెహేము చేరుకున్నాడు. ఈ విధంగానే జనాభా లెక్కలలో తమపేర్లు ఎక్కించుకోడానికి అనేకమంది బెత్లెహేము చేరుకున్నారు. అందువల్ల యోసేపు దంపతులు ఉండడానికి ఎక్కడా ఒక సత్రంగాని, ఒక వసతి గృహంగాని లభించలేదు. మరియా చూస్తే నిండు గర్భవతి. ఆ దంపతులను చూచి - ఒక రైతు కనికరించి తన పశువుల పాకలో ఉండుటకు సమ్మతించాడు. ఆ పశువుల పాకలోనే మరియాసతి ప్రసవించింది. ప్రపంచాన్ని పాలించే ప్రభువు యొక్క కుమారుడు ఒక పశువుల పాకలో జన్మించాడు ! ఎంత ఆశ్చర్యము !! ప్రజా

రక్షకుడు ప్రభువు ఎన్ని కష్టనష్టాలకైన వెనుదీయుడుగదా ! మరియాసతి తన కుమారుని చిన్న చిన్న బట్టలతో కప్పి - పశువుల మేసే ఒక తొట్టెలో పరుండ బెట్టింది. ఆ దంపతులు తమ బిడ్డను వేయి కన్నులతో ఆ రాత్రి అంతా చాలా జాగ్రత్తగా కాపాడుకున్నారు.

## గొర్రెలకాపర్లు దేవదూత ప్రత్యక్షము

బెత్లెహేము ప్రాంతంలో ఉన్న పొలాలలో కొందరు గొర్రెలకాపర్లు-ఆ రాత్రి అక్కడనే ఉంటూ, చలివల్ల మంటలు వేసుకొని చలిని వారించుకుంటూ ఉన్నారు. ఎప్పుడైతే ఏసు జననం జరిగిందో, అప్పుడే ఆ గొర్రెల కాపర్లకు ఒక దేవదూత ప్రత్యక్షం కావడం జరిగింది. వారందరూ భయం చెందారు. దేవదూతగా గుర్తించి ఎంతో ఆనందించారు - ఆ దేవదూత వారికి యిలా చెప్పింది.

"మీరు భయపడకండి. మీకు రక్షకుడు జన్మిచాడు. మీకు ఈ శుభవార్తను చెప్పుటకే వచ్చాను. బెత్లెహేములో ఒక రైతు పశువుల పాకలో రక్షకుడు (ఏసు) జన్మించాడు. ఆ పశువుల పాకలో చిన్న చిన్న బట్టలతో కప్పి తొట్టెలో పరుండ బెట్టారు తల్లిదండ్రులు" అన్నాడు.

"వారిలో కొందరు మా ప్రభువును చూడాలని ఉంది. మేము ఎలా చూడ గలము. ఈ కటిక చీకటిలో ఎలా వెళ్ళగలము?" అని ప్రశ్నించారు.

దేవదూత ఇలా అన్నాడు. "మీరు నా జ్యోతిని చూస్తూ రండు. మీకు దారి తెలుస్తున్నది" అని దూత ఒక జ్యోతిగా మారిపోయాడు. ఆ జ్యోతిని చూచుకుంటూ కాపర్లందరూ బయలుదేరి వెళ్ళారు. మరియా యోసేపులను ప్రభు కుమారుడైన క్రీస్తును దర్శించారు. దేవదూత చెప్పినట్లుగానే బాలుడు చిన్న చిన్న గుడ్డలతో కప్పబడి తొట్టెలో పండుకుని యున్నాడు. వాళ్ళు ఆ బాలయేసును దర్శించుకొని ఎన్నో విధాలుగా స్తుతించారు. ఈ వార్త బెత్లెహేము ప్రజలందరకూ తెలియజేశారు. ప్రజలందరూ ఎంతో ఆనందించారు.

ప్రభుకుమారుడు జన్మించి ఎనిమిది రోజులయింది. అప్పుడు మరియా దంపతులు ఆ బాలునికి "ఇమ్మానుయేలు" అని నామకరణం చేశారు. ఇమ్మానుయేలు అనగా ప్రజలయొక్క పాపములను పోగొట్టువాడు అని అర్థము. కాని, మరియా సతికి దేవదూత చెప్పిన విధంగా "ఏసు" అనియే పిలవసాగారు.

తరువాత మరియా దంపతులు యెరూషలేము బాలునితో వెళ్ళారు. ప్రభువు ఏర్పరచిన ధర్మశాస్త్రంలో "తొలిచూలు మగపిల్లవాడు అయినచో ఆ బాలుని యెరూషలేములో గల దేవాలయంలో ప్రతిష్ఠ చేయడానికి వెళ్ళారు.

## సుమెయోను - హన్న - ల కథ

యెరూషలేములో సుమెయోను అను ప్రభువుయొక్క భక్తుడు నివసిస్తూ ఉన్నాడు. అతడు దైవభక్తుడే గాక, గొప్ప నీతిగలవాడు. సదా ఇశ్రాయేలు ప్రజల

రక్షణ గురించి ఆలోచించేవాడు. ఆ రోజులలో హేరోదు ఆ ప్రాంతానికి రాజుగా ఉండేవాడు. ప్రజలను చాలా బాధ పెట్టేవాడు. చాలా నీచమైన పనులు చేయించే వాడు. తాను కూడా చేస్తుండేవాడు. అన్న భార్యనే పెండ్లాడిన దుష్టబుద్ధి గలవాడు. అందువలన సుమెయోను ప్రజలను రక్షించు ప్రభువు ఎప్పుడు వస్తాడా? అని ఎదురుచూస్తూ సదా ప్రభువును "మాకు రక్షకుని ప్రసాదింపుము" అని ప్రార్థిస్తూ ఉండేవాడు. అతని కోరిక ప్రభువు ఆలకించాడు. "త్వరలోనే మీకు రక్షకుడు వస్తాడు. నీవు తప్పక ఆతనిని చూస్తావు. ఆశీర్వదిస్తావుకూడా" - అతనికి నమ్మకం కలిగించాడు; కలలో కనిపించి.

ఆ రక్షకుడు ఏ రూపంలో వస్తాడో, ఏ వయస్సులో వస్తాడో - కొన్ని ఆనవాళ్ళుకూడా తెలియజేశాడు. అందువల్ల సుమెయోను ఆ రక్షకుని కొరకు ఎదురు చూస్తూ యెరూషలేము ఆలయంలో ఉంటున్నాడు.

హన్న ఒక విధవరాలు, ఆ పేరు గోత్రీకుడైన ఫెనూయేలు కుమార్తె భర్తతో ఆమె ఏడు సంవత్సరాలు మాత్రమే కాపురం చేసింది. పిదప విధవరాలు అయింది. అప్పటినుండి ఆమె రాత్రింబవళ్ళు ప్రభు సేవలోనే కాలం గడుపుతూ దేవాలయంలోనే ఉంది. ఆమె వయస్సు బాలయేసు యెరూషలేము వచ్చునప్పటికి 84 సంవత్సరాలు.

హేరోదురాజు కుట్రవలనే హన్న యొక్క భర్త గతించాడు. అందువల్ల ఆమెకూడ హేరోదురాజు పరిపాలన అణగారి పోవాలని, రక్షకుడు రావాలని నిత్యమూ ప్రభువును ఆరాధించేది.

అట్టి సమయంలో మరియా దంపతులు బాలయేసుతో యెరూషలేము వచ్చారు. ధర్మశాస్త్రం ప్రకారం అన్ని పూజలు ముగిశాయి. సుమెయోను ఆ సంద

ర్భంలో బాలయేసును చూశాడు. కలలో దేవదూత చెప్పిన లక్షణాలను బట్టి "ఇతడే ప్రభు కుమారుడు - రక్షకుడు" అని గ్రహించాడు. వెంటనే బాలయేసును తన చేతులలోనికి తీసికొని కళ్ళకు అద్దుకున్నాడు.

"ప్రభూ ! నీ మాట నిలుపుకున్నావు. సమస్త ప్రజలను రక్షించు. ఇశ్రాయేలు ప్రజలను పునీతులను గావించు. నీ దర్శనం అయింది కాబట్టి యిక నన్ను నీ దగ్గరకు తీసుకో" అని ప్రార్థించాడు.

హన్న కూడ అక్కడనే ఉంది గాబట్టి ఆమెగూడ బాలయేసుని ప్రార్థించింది. ఇశ్రాయేలు రక్షింపబడుటమే నా తుది కోరిక. ఇక నన్ను గూడ నీ వద్దకు తీసికొని పొమ్ము" అని ప్రార్థన చేసుకుంది. ఆ బాలయేసును గూర్చి అక్కడగల వారంద రికీ, నగరంలో గల వారందరికీ అతి ఉత్సాహంతో తెలియపరచింది.

మరియా దంపతులు బాలయేసుతో అక్కడి ధర్మశాస్త్రవిధులు ముగిశాక స్వగ్రామమగు "నజరేతు" గ్రామానికి చేరుకున్నారు.

## హేరోదు - కుట్ర

బాలయేసుకు రెండో సంవత్సరం వచ్చింది. బెత్లెహేములో "రక్షకుడు" పుట్టాడని, త్రికాలజ్ఞులగు మహాత్ములకు కొందరికి తెలిసింది. వారు తూర్పు దేశపు త్రికాలజ్ఞులు. అనగా జరిగినది, జరుగుతున్నది, జరుగబోవునది తెలిసికొను శక్తి

గలవారన్నమాట. వారందరూ యెరూషలేముకు వచ్చారు. రాజైన హేరోదును జూచి యిలా అడిగారు.

"రాజా ! యూదులను రక్షించుటకు, వారి పాపాలను నిర్మూలించుటకు బెత్లెహేములో రక్షకుడు పుట్టాడటగదా ! ఇక్కడకువచ్చి ధర్మశాస్త్రంలో పేర్కొన్న ప్రకారం పూజలుగూడ నిర్వహించి వచ్చాడటగా ! మాకు దేవదూత తెలియజేశాడు. ఆ దూత జ్యోతిగా మారి మార్గం చూపించాడు. మేమా రక్షకుని చూడాలని వచ్చాము. అతడు యూదులకు మహారాజు గదా ! అతనిని చూడాలని వచ్చాము. ఆ బాల ప్రభువు ఎక్కడ ఉన్నాడు" అని ప్రశ్నించారు.

హేరోదు రాజునకు తన రాజరికము పోతుందేమో అన్న భయం పట్టుకొంది. అతని అనుచరులకు మంత్రులు వగైరా అందరకూ అదే భయం పట్టుకుంది. అయినా, ఆ త్రికాలజ్ఞుల వద్ద సంతోషించినట్టుగా నటించారు."ఆ రక్షకుడు ఎక్కడ ఉన్నాడో మాకు సరిగా తెలియదు. ఈ రోజునుండి ప్రయత్నించి ఎక్కడ ఉన్నదీ మీకు తొందరగానే తెలియజేస్తాను" అని వారిని పంపివేశాడు.

హేరోదుకు ఎవరో వచ్చి రాజుకావడం తను, తన సంతతి వ్యర్థులుగా, పరిచారకులుగా ఉండటం ఇష్టలేదు. అందువల్ల హేరోదు తన యాజ్ఞను పాటించు వారగు ప్రధాన యాజకులను, తనకు విశ్వాసపాత్రులగు సేవకులను పిలిపించి రహస్యంగా ఒక సభ ఏర్పాటు చేశాడు. ఆ సభలో వారందరూ ఒక నిర్ణయం చేశారు. ఆ నిర్ణయం ప్రకారం రెండు సంవత్సరాల లోపు పిల్లలు ఏ గ్రామంలో ఉన్నా వారినందరను చంపిరండని కఠిన మనస్కులైన సేవకులకు ఆజ్ఞలు జారీ చేశాడు.

రాజభటులు రాజాజ్ఞ ప్రకారం రాజ్యంలోని అన్ని గ్రామాలకు, యింటింటికి వెళ్ళి రెండేండ్లలోపు ఉన్న బాలకులనందరినీ అతిక్రూరంగా చంపివేశారు.

ఈ విధంగా హేరోదురాజు ఆ నడిచే రాజభటులు చంపిన బాలురలో "ఏసు" లేడు. ప్రభువుకు హానిచేయడం ఎవరికి సాధ్యమవుతుంది ? "నజరేతు" గ్రామంలో రాజభటులు వెదకినా, యోసేపు యింటిచుట్టు తిరిగినా, వారికి ఏసుజాడ తెలియలేదు. రాజభటులకు ఆ సమయంలో మైకం గప్పింది. అది అంతా దైవలీల.

## దేవదూత - యోసేపు దంపతులు

దేవదూత-రాజభటులు యోసేపు మందిరం దాటగానే యోసేపు దంపతులకు ప్రత్యక్షమయ్యాడు. "ఓ మహనీయులారా ! రాజు రక్షకుడు కాదగిన యేసుబాలుని చంపించుటకు ప్రయత్నించుచున్నాడు. కావున, మీరు ఏమీ సందేహింపక, ఈ గ్రామం వదలి "ఐగుప్తునకు" వెళ్ళిపోండి. మీకు ఏ హానీ ఉండదు. మీ రక్షణకు నేనా వెనుక సహాయంగా ఉంటాను" అని దేవదూత చెప్పాడు.

మరియా దంపతులు ఆ రాత్రికి రాత్రియే, బాలుని రక్షణార్థమై ఐగుప్తునకు వెళ్ళిపోయారు. దేవదూత తగిన జాగరూకతతో వారు ఐగుప్తు చేరువరకు సంరక్షకుడుగా వెంబడించియే యున్నాడు, అదృశ్యరూపంలో

## యోసేపు దంపతులు తిరిగి నజరేతు వచ్చారు

మరియా దంపతులు కొంతకాలం ఐగుప్తులో బాలయేసుతో నివసించారు. అక్కడ వారు 8 సం॥లు ఉన్నారు. తరువాత నజరేతు గ్రామానికి చేరుకున్నారు. యోసేపు మొదటినుండి వడ్రంగి పనిచేస్తూ వుండేవాడు. అందువల్ల ఐగుప్తునుండి నజరేతు గ్రామానికి వచ్చిన యోసేపు తిరిగి వడ్రంగి పని మొదలుపెట్టాడు; ఏసు చిన్న చిన్న పనులలో తండ్రికి సహాయం చేస్తూండేవాడు.

## యెరూషలేము ప్రార్థనా మందిరం

ఏసు క్రమంగా పెరిగి పండ్రెండేండ్ల వాడయ్యాడు. ప్రతి సంవత్సరం యెరూషలేంలో "పస్కా" పండుగ చాల గొప్పగా జరుగుతుంది. ఆ మహోత్సవం చూడడానికి - ఆ చుట్టుపట్టులనున్న గ్రామాల వారందరూ వేలకొద్ది వెడుతూ వుంటారు.

మరియా దంపతులు ప్రతి సంవత్సరం యెరూషలేము వెళ్ళివస్తూ వుంటారు. ఆ సంవత్సరం కూడ ఆ దంపతులు 12 ఏండ్లు గల తమ బాలయేసుతో పస్కా పండుగ జరుపుకొనుటకు యెరూషలేము వెళ్ళారు. వేలాదిమంది కాలినడకతో ఆ యాత్ర సాగిస్తూ ఉంటారు. ఆ జన సమూహంలో మరియా దంపతులు ఆ బాల యేసుతో ఆనందముగా బయలుదేరారు. అది చాల దూరప్రయాణం. అయినా సరే ఎంతో ఆనందంతో ప్రయాణం సాగించారు.

పస్కా పండుగ వేడుకలన్నీ ముగిశాక, జనం అంతా తమతమ గ్రామాలకు బయలుదేరారు. మరియా, యోసేపు కూడా తిరిగి నజరేతు గ్రామానికి ఆ గ్రామ వాసులందరితోను ముచ్చటించుకొనుచు బయలుదేరారు. యెరూషలేములో జరిగిన ఆ పస్కా పండుగయొక్క వింతలు - విశేషాలు ముచ్చటించుకొనుచు వచ్చే మరియా దంపతులకు తమ బాలయేసు సంగతియే జ్ఞాపకం రాలేదు.



కొంతదూరం వచ్చాక ఆ దంపతులకు తమ కుమారుని సంగతి జ్ఞప్తికి వచ్చి చూచుకొన్నారు. వారు విభ్రాంతితో ఆ యాత్ర బృందమంతా వెతికారు. ఎక్కడా ఏసు కనబడలేదు. ఇంతవరకూ యాత్రిక బృందం యొక్క పిల్లలతో తమ పిల్లవాడు ఉన్నాడనే వారు ఉపేక్ష చేశారు. కానీ, ఎంత వెదకినా కనిపించని కుమారునికొరకై వారు చాలా దిగులు చెందారు. అందువలన యెరూషలేములోనే ఎక్కడో తప్పిపోయి ఉంటాడని భ్రమించి తిరిగి వెనక్కు తిరిగి యెరూషలేము చేరుకున్నారు.



యెరూషలేము మూడురోజులకు చేరుకొన్నారు. ఆ దంపతులు పట్టణమంతా వెదికారు. ఎక్కడా ఏసు జాడ కనిపించలేదు. తమకు తెలిసినవారి అందరి యిండ్లు వెదికారు. బంధువులు యిండ్లు కూడ చూశారు. అయినా వారికి కుమారుని జాడ కనిపించలేదు. క్రమముగా వారు పట్టణంలోని పెద్దపెద్ద అంగళ్ళలోను, దుకాణములలోను, ప్రతి వీధిలోను వెదికారు. అయినా ఏసు కనిపించలేదు. చివరగా వారు యూదుల యొక్క ప్రార్థనా మందిరంలోకి వెళ్ళారు. అక్కడ ప్రముఖులైన ప్రవక్తలమధ్య తమ కుమారుడు కూర్చుని ఉండుట చూచి ఆ దంపతులు ఎంతో ఆనందించారు. ఎంతో ఆశ్చర్యం కూడ చెందారు.

ప్రముఖులు, మహాజ్ఞానులు, వృద్ధులు అయిన ప్రవక్తల మధ్య కూర్చుండి, వారు చెప్పుచున్నవి ఆలకించుచు, వారినే ఏలేవూ ప్రశ్నలు వేయుచున్న ఏసును చూడగానే ఆ తల్లిదండ్రులు ఎంతో విశ్రాంతి చెందారు. వారు నెమ్మదిగా, సంజ్ఞలు చేస్తూ కుమారుని పిలిచి యిలా అడిగారు.

“నాయనా ! నీవు మాతో ఎందుకు బయలుదేరలేదు ? నీ తోటి బాలురతో నీవునూ ఉంటావనే నమ్మకంతో మేము మన గ్రామవాసులతో నజరేతు గ్రామానికి బయలుదేరాము కొంతదూరం చేరాక నిన్ను వెదికాము. కానీ నీవు కనిపించలేదు. మేము దిగులు చెంది తిరిగి ఇక్కడకు వచ్చాము. పట్టణంలో నీ గురించి రెండు రోజులు వెదికాము మమ్ము విడిచి ఈ ఐదారు రోజులు ఎక్కడ ఉన్నావు ? ఎక్కడ భుజించావు ?” అని అనేక విధాల ప్రశ్నించారు.

బాలఏసు నవ్వుచూ “తల్లిదండ్రులారా ! మీకు ఎందుకింత భయం ? ఇన్ని రోజులు ప్రభుమందిరంలోనే ఉన్నాను. పెద్దలచే జ్ఞానోపదేశం పొందుచున్నాను. వారి బోధలు చాలా విరుద్ధముగా ఉన్నవి. నేను అడిగినవాటికి జవాబు చెప్పువారు ఒకరిద్దరు మాత్రమే ఉన్నారు. నేను ఎలాగూ ఇక్కడ ఉండవలసివాడినే గదా ! ప్రభువు పంపించినది కూడ అందుకే గదా ! కావున ఇక్కడివారి సంగతులు, మనస్తత్వము తెలిసికొనుచున్నాను” అని చెప్పాడు.

తల్లిదండ్రులు ఎంతో విశ్రాంతి చెందారు. తప్పిపోయాడనుకున్న తమ కుమారుని యొక్క మాటలు వారికి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించాయి. “ఈ బాలుడు సామాన్యబాలుడు కాడు దేవదూత చెప్పినట్లు పాపులను ఉద్ధరించుటకు వచ్చిన రక్షకుడే” అని మనస్సులలో భావించారు. అయినా, వారు పుత్ర

ప్రభుకుమారుడు నాకంటే శక్తిమంతుడు. ఆయన పాదధూళికి గూడ నేను సమానుడను కాను. ఆయన మహిమలను చూడుడు. ఆయన హితబోధలు వినుడు" అని పలుకుచు వారందరికీ బాప్తిస్మమొసంగెను. యోహానుచే బాప్తిస్మము పొందినవారిలో యూదయదేశ గ్రామ ప్రాంతములవారు, యెరూషలేము ప్రజానీకం కూడ ఉండెను.

## యోహాను ప్రబోధము

బాప్తిస్మము పొందిన ఓ ప్రజానీకమా ! మీరు శ్రద్ధగా నా వాక్యములు వినుడు.

దేవుడు మన కొరకు యీ సమస్త సృష్టిని సృష్టించి మనకు ధార పోసినాడు. వెలుగును ప్రసాదించినాడు. విశ్రాంతి చెందుటకు చీకటినికలిగించినాడు. భూమి, ఆకాశములను, నక్షత్రములను సృజించినాడు. మనకు జలము కావలయును గదా ! అందుకు సరస్సులు, నదులు, సముద్రములు, మహాసముద్రములు ఏర్పరచినాడు. భూమిపై వృక్షములు జన్మింపచేసినాడు. సముద్రములలో చేపలను పుట్టించినాడు. మనకు ఆహారముగా చేసినాడు. అనేక రకములగు పక్షులను పుట్టించినాడు. అడవులలో (శూన్యమగు ప్రదేశం) జంతువులను సృష్టించినాడు. తరువాత ఆయన మానవులను సృష్టించినాడు. మొదట పుట్టిన మానవదంపతులే, "ఆదాము - హవ్వ" అనువారు. దేవుడు సృష్టించిన మానవులందరిలోను ఆత్మ ఉన్నది. సమస్త జీవజాలమునకు ఆత్మ కలదు. ఆత్మ జీవములో మిళితమై కలిసియున్నను ఆ ఆత్మ

దేవునియొక్క అంశమే. మనము మన ఆత్మను చూడలేము. కానీ ఆత్మపరిశుద్ధముగా నున్నచో మనము దేవుని దర్శించగలము. మాటలాడగలము; ఆయన ప్రకటించు బోధనలను ఆలకించగలము. దేవుడు మహోన్నతుడు. ఆయన దయవలననే మనకు అన్నియు లభించుచున్నవి. సుఖముగా మనము జీవించగల్గుచున్నాము.

కావున దేవుని మనము నిత్యమూ స్మరించుకోవలెను. "ప్రభువా ! నీవు మాత్రె సమస్తము ఏర్పరచితివి. వెలుగు చీకటులు కల్గించితివి. ఆహారము సమ కూర్చితివి. పశుపక్ష్యాదులను, రమణీయమైన వస్తువులను సృజించితివి. నిత్యము నిన్ను తెలుసుకొనుటకు, నిన్ను ప్రేమించుటకు మాకు శక్తి నొసంగుము" అని ప్రార్థన చేయుచుండవలెను.

## హేరోదు దుండగములు

కాని, స్వార్థబుద్ధితో, ఆడంబరమైన వేషాలతో శక్తియున్నదను అహం కారముతో మనం ఎప్పుడునూ ఎవ్వరికినీ హాని చేకూర్చరాదు. ఇందుకు ఉప మానముగా మనరాజు హేరోదును చూడండి ! అతడు అధిపతియైనందున మహా గర్వించి ఎందరో ప్రజలకు, గ్రామస్థులకు అపకారములు చేయుచున్నాడు. ప్రజలను పాలించు రాజే కఠినుడుగా ఉన్న ప్రజలు ఎట్లు మనుగడ సాధించగలరు ? చేయని నేరములకు ఎందరినో హింసించినాడు. కాళ్ళు చేతులు విరిపించినాడు. అందువలన ఆయా కుటుంబములవారు ఎంతగానో బాధపడుచున్నారు. హేరోదురాజు ప్రహార కృత్యముల వలన అనేకమంది గ్రుడ్డివారు, అంగవిహీనులు, కుంటివారుగా జీవించు చున్నారు.

వీటన్నిటికన్నా మహా ఘోరమైన పాపమును చేసినాడు. అదేమనగా; హేరోదు అన్నగారు ఫిలిప్పు. అతని భార్య హేరోదియ. హేరోదు అన్నను వంచించి చెరసాలలో ఉంచినాడు. వదినగారగు హేరోదియను పెండ్లాడినాడు. చూశారా! రాజు చేయవలసినపనియేనా? తల్లితో సమానమగు వదినగారిని పెండ్లాడి, ఆమె యొక్క పుత్రికలను కూడ పొందినాడు. అందుకు "ఇది తప్పు" అని జ్ఞానం బోధించిన వానినెలా శిక్షించినాడు, చంపించినాడు. కావున అతని యెడ వినయ విధేయతలు చూపకుడు. సదా రక్షకునికై ప్రార్థన చేయుడు. ప్రభు పుత్రుడు తప్పక వచ్చి మీకు రక్షకుడు కాగలడు" అని బోధించెను.

## యేసు యోహానుచే బాప్తిస్మము పొందుట

ఆ తరువాత కొద్దిరోజులకే బాప్తిస్మము పొందుటకు యోర్దాను నదీ తీరము నందు ఏసు నజరేతునుండి యోహాను దగ్గరకు వచ్చెను. ఏసును జూచి యోహాను ఇట్లా అన్నాడు. "రక్షకుడా! నేను నీచేత బాప్తిస్మము పొందవలసినవాడను. కానీ నా చేత బాప్తిస్మము పొందుటకు నీవే నా దగ్గరకు వచ్చితివి. నేను నీకు బాప్తిస్మము ఒసగజాలను" అని నిరాకరించెను.

అందుకు ఏసు నవ్వుచు "ఆ విధంగా నీవు ఎందుకు నిరాకరించుచున్నావు. ప్రభువు యొక్క ఆదేశము అట్లా ఉన్నది. ప్రభువు ఆజ్ఞానుసారము మనము చేయవలయును గదా! కాబట్టి నీవు అనుమానించకు; నన్ను నిరాకరించకు. అనుగ్రహంతో, సంతోషంతో నాకు బాప్తిస్మము ఒసగుము" అని చెప్పెను.

యోహాను క్రీస్తు మాటలను గౌరవించెను. యోర్దాను నదీ తోయముతో ఏసుకు బాప్తిస్మము ఒసగెను. యేసు బాప్తిస్మము పొంది నదీతీరములకు వచ్చి నిలబడెను.

అప్పుడు ఆకాశము నుండి యొక వాక్యము వారికి వినబడినది. "ఇదిగో ! ఆకాశం తెరువబడినది. దేవుని ఆత్మ పావురం వలె వచ్చి రక్షకుని (ఏసు)లో కలియుచున్నది. ఆతడే (ఏసే) నా ప్రియ కుమారుడు. ఈ రక్షకునిలో ప్రజారక్షణ ఉన్నది. నేనూ, మీరూ ఆనందించదగిన సంతోష సమయమిది" అని.

ఆ వార్త ఆకాశంనుండి వచ్చినది; అటకు సమీపమున గలవారందరూ విన్నారు. సంతోషించినారు.

## సాతాను ప్రయత్నం

ఏసు బాప్తిస్మముపొంది, విశ్వరూపముతో వెలిగిపోతుండగా ముందుకు బయలుదేరినాడు. ఏసును పరీక్షించుటకు ఒక సాతాను ఆయన దగ్గరకు వచ్చింది. సాతాను ఏసును కలిసికున్న చోటు ఎవ్వరులేని ఒక కొండల ప్రదేశము. ఆ కొండలు అన్నీ చాల ఎత్తుగా ఉన్నవి. ఏసును ఎన్నో విధాలుగా ప్రయత్నిస్తూ నలభై దినాలు ఆయన వద్దే ఉన్నది. ఈ నలభై దినాలు ఏసు ఏమీ తినలేదు.

ఏసును జూచి సాతాను యిలా ప్రశ్నించింది.

"నీవు దేవుని కుమారుడవు కదా! ఏమీ తినకుండా ఈ నలభై దినాలు ఎందుకు ఉపవాసం చేశావు? ఈ రాళ్ళను రొట్టెలుగా మార్చుకొను శక్తిలేదా నీకు?" అని.

ఏసు యిలా అన్నాడు: "జీవించుటకు రొట్టె మాత్రమే చాలదు" ఇది ప్రభువాక్యము. అని.

సాతాను ఏసును విడిచిపెట్టలేదు. తన మాయాశక్తితో ఏసును తీసికొని పోయింది. అన్ని దేశాలూ చూపించింది. ఏసును జూచి "చూశావుగదా! ఈ దేశాలన్నీ, నీవు నాకు శరణు జొచ్చి, నేను చెప్పినట్లుగా వింటే - ఈ సర్వదేశాలు అన్నీ సంపదలతో నీకు కైవసం చేస్తా" అంది.

ఏసు చిరునవ్వుతో మందహాసం చేశాడు.

సాతాను తిరిగి ఏసుతో బయలుదేరి, యెరూషలేము దేవాలయ గోపురం మీదికి వచ్చాడు. ఏసును జూచి "నీవు దేవుని కుమారుడవే అయితే - ఈ శిఖరం నుంచి క్రిందకి దూకు" అన్నాడు. ఏసు ఏమీ అనలేదు. సాతాను అన్నాడు! దూకినవో దేవుడు తన దూతను పంపి నిన్ను రక్షిస్తాడా? దేవతలు నీకు గాయాలు కలుగకుండా కాపాడగలరా?" అన్నాడు.

ఏసు మందహాసంతో యిలా అన్నాడు, నీవు కోరినట్లు నేను చేయాలని ప్రభువు చెప్పలేదు. నీవు ఎంత బలవంతపెట్టినా నీ కోరిక ఏదీ సాగదు" అన్నాడు.

సాతానుకు ఏదీ తోచలేదు. "ఎన్ని విధాలుగా యత్నించినా నా కోరిక తీర

లేదు; ఈతనిచే తప్పుడు పని చేయించలేను" అని నిశ్చయించుకొని వెళ్ళిపోయాడు.

ఆ రోజునుండి ఏసు యెరూషలేము నుండి బయలుదేరి చుట్టుపట్ల గల ప్రాంతాలలో పర్యటించారు. అనేకమంది గ్రామప్రజలకు నీతి బోధిస్తూ, వారికి ఎన్నియో విధముల సహాయం చేయసాగాడు

## హేరోదు యోహానును బంధించుట

"యోహాను ప్రకటనవల్ల గ్రామస్థులంతా ప్రభుత్వానికి ఎదురు తిరుగుతున్నారు. సరిగా పన్నులు చెల్లించుటలేదు. మేము చేసే పనులన్నిటికీ వారు ఆటంకం కల్గించుచున్నారు. ఎందుకిది ? అని వారు ఎదురు ప్రశ్నలువేసి మాకు ప్రతి పనియందు అడ్డు తగులుచున్నారు" అని హేరోదు రాజుకు తన పలుకుబడిలో గల ఉద్యోగులనుండి అనేక ఫిర్యాదులు యోహానుపై వచ్చినవి.

అందువలన హేరోదురాజుకు యోహానుపై కోపము వచ్చినది. అందువలన తన భటులను పిలిచి "మీరు వెంటనే యోహాను ఎక్కడున్నను బంధించి చెరసాలలో వేయండి" అని ఆజ్ఞాపించాడు. భటులు వెంటనే వెళ్ళి యోహాను నదీతీరమునందు సంచరించు యోర్దానును బంధించి చెరసాలలో బంధించారు.

హేరోదు భార్య (అన్న భార్య) యగు హేరోదియకు కూడ యోహానుపై చాలకోపం ఉంది. ఆమె హేరోదును చూచి "వెంటనే యోహానును చంపివేయు" మని కోరింది. కానీ, హేరోదు రాజు ఆలోచించాడు. "జనాంగమునకు యోహానుపై

చాల అభిమానం. పైగా అతడు ప్రవక్త. కావున యోహాను మరణం యిప్పుడు కాదు, కొంతకాలం ఆగుము" అని హేరోదియను సమ్మతింపచేశాడు.

## ఏసు కపెర్నహూము చేరుట

గలిలియ ప్రాంతమున సంచరించుచు, పాపులను పవిత్రులుగా చేయుచున్న ఏసుకు "యోహాను చెరపెట్టబడె"నను సంగతి తెలిసినది. అందువలన ఆయన నజరేతు మార్గమున బయలుదేరి జెబూలూను, నఫ్తాలి దేశముల మీదుగా కపెర్న హూమునకు వచ్చి - తనను చూడవచ్చిన వారికి సహాయము చేయసాగెను.

ఒకనాడు ఆయన సముద్రతీరమునందు సంచరించుచుండగా "పేతురు, ఆంద్రెయ" అను సోదరులు చేపలు పట్టుకొనుచుండగా చూచినాడు. ఏసు వారలను చూచి "మీరు చేపలను పట్టుటకాదు; మనుష్యులను పట్టవలెను. (వారిని జ్ఞానవంతులను చేయుటకు) కావున నా వెంబడి రండు" అని పిలిచెను. వెంటనే ఆ సహోదరులు తమ వలలను విడిచి, ఆయనను వెంబడించిరి.

అటునుండి వారు వెళ్ళుచుండగా, "జెబెదయి" కుమారులైన యాకోబు, యోహాను అను సహోదరులు కనిపించిరి. వారిని కూడా ఏసు రమ్మని ఆహ్వానించెను. వారు తమ తండ్రికి చెప్పి ఏసును వెంబడించిరి. [చెరలోనున్న యోహాను జకర్యా కుమారుడు; ఇప్పుడు ఏసును వెంబడించిన యోహాను జెబెదయి కుమారుడు.]

ఏసుప్రభువు ఈ నల్గురితో బయలుదేరి పలు గ్రామములు సంచరించెను. అనేక సమాజ మందిరములలో బోధించుచు, (దేవుని) రాజ్యమును గూర్చిన సువార్తలు ప్రకటించుచు ప్రజలను చైతన్యవంతులుగా చేయసాగెను. ప్రజలకు రక్షకునిపై నమ్మకం కుదిరినది. ప్రజలలోగల ప్రతి వ్యాధిని పోగొట్టుట, వారిని ఆరోగ్యవంతులుగా చేయుట - మొదలగు మహత్తుల వలన ప్రభుకుమారుని కీర్తి సర్వత్రా వ్యాపించినది.

ఈ విధముగా రక్షకుని (ఏసు) క్రీస్తు "సిరియా" దేశమంతటనూ వ్యాపించింది. నానారోగముల చేతను, వేదనలచేతను, సాతానుల (అపవాదులు) చేత పీడింపబడువారిని, చంద్రరోగులను, దయ్యములచేత బాధపడువారిని, పక్షవాతము గలవారిని, అంధులను, అంగవిహీనులను, కుంటివారిని ఆయన ప్రభుకృప పొంది బాగుచేసెను.

గలిలియ, దెకపోలి, యెరూషలేము, యూదయ రాజ్యమందలి పలు ప్రాంతములనుండియు, యోర్దాను నదీతీరమునకు అవతలనుండియు, ఇవతలనుండియు బహుజన సమూహములు వచ్చి యేసుప్రభువును వెంబడించారు.

## ఏసు ప్రబోధము

ఆ జనసమూహమును గాంచి ప్రభుకుమారుడగు ఏసు వారికి ఎన్నియో నీతులు బోధించాడు.

"ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు; పరలోకరాజ్యము వారిది గనుక."

"దుఃఖపడువారును ధన్యులే. వారు దేవునిచే ఓదార్చపడుచుందురు."

"సాత్వికులు ధన్యులు; వారు భూలోకమున స్వతంత్రముగా జీవించ గలుగుదురు."

"నీతి-నియమము కొరకు ఆకలిదప్పులు గల వారైనను ధన్యులే. వారు దేవునిచే తృప్తి పొందుదురు."

"కనికరము గలవారు, హృదయశుద్ధి గలవారు, శాంతచిత్తము గలవారు ధన్యులు. వీరందరు దేవునిచేత, దేవదూతలచేత పవిత్రులగుదురు."

"నీతికొరకు పోరాడువారు, హింసింపబడినను వారు ధన్యులే. పరలోక రాజ్యమున వారు సదాసుఖముగా నుందురు."

"నా నిమిత్తమై మిమ్ము ఎవరుగాని, నిందించినను హింసించినను భయ పడకుడు. దేవుడే మీకు తోడుగా ఉంటుంటాడు గనుక అట్టివారు ధన్యులు.

"మీరు లోకమునకు వెలుగు చూపించాలి. స్వార్థము మంచిదికాదు; స్వార్థ రహితులుగా సంచరించాలి" అని బోధించెను.

## ఏసు - ఆయన శిష్యులు

ఏసు పలు ప్రాంతములు సంచరించుచు, ప్రజలకు ప్రభు సందేశములను వినిపించుచు, తనను నమ్మినట్టి 12 మందిని శిష్యులుగా చేసుకొన్నాడు. వారు

1) పేతురు ఇతనికి సీమోను అను పేరుకూడ ఉంది. 2) ఆంద్రెయ, 3) యాకోబు 4) యోహాను [వీరు జెబెదయి కుమారులు] 5) ఫిలిప్పు, 6) బర్తొలొమయి 7) తోమా, 8) మత్తయి, [ఇతడు సుంకరి - పన్నులు వసూలు చేసేవాడు] 9) యాకోబు [అల్పాయి కుమారుడు] 10) తెబ్బయి [వీనికి తద్దయి యను నామాంతరము కలదు. 11) సీమోను [ఇతడు కనానీయుడు] 12) ఇస్కరి యోతు యూదా (ఇతడే ప్రభుకుమారుని బంధించుటకు శత్రువర్గం వలన లంచం తీసికొన్నవాడు.)

ప్రభుకుమారుడయిన ఏసు తన శిష్యులను పండ్రెండు మందిని ఒకచోట కూర్చుండి యిలా బోధించాడు :

"శిష్యులారా ! మీరందరూ శ్రద్ధగా ఆలకించుడు. మీరు అపవిత్రులను పవిత్రులుగా చేయుడు. ఇశ్రాయేలు వంశీయులు ప్రభువును నమ్మినవారు. నాటి సమరయుల (మంచి మనస్సు గలవారు కారు) యొక్క ప్రకటనలకు లోబడి పొడగుచున్నారు. వీరందరు అమాయకులు, గొఱ్ఱెపిల్లల వంటివారు. పరలోక రాజ్యము సమీపించుచున్నదని ప్రకటించాడు. రోగులను ఆరోగ్యవంతులను చేయుడు. అన్యాయముగ మరణించినవారిని లేపుడు, కుష్ఠురోగులను బాగుచేయుడు. సాతానులను (దయ్యములను) పారద్రోలుడు. మీ ప్రయాణమునకు ఎవరిని ఏమీ కోరకుడు. బంగారంగాని, వెండికాని, రాగిగాని, దుస్తులుగాని, చివరికి కాలి చెప్పులనైనను ఆశించకుడు. పట్టణముగాని, గ్రామముగాని మీరు వెళ్ళునప్పుడు అక్కడ యెవరు యోగ్యులో విచారించి, వారి యింటనే తిరిగి వెళ్ళువరకు నివసించుడు. వెళ్లునప్పుడు వారికి "శుభ"మని చెప్పుడు. వారు యోగ్యులే అయినచో, వారు సుఖింతురు. దేవుని వాక్యము ఫలించును. మిమ్ములను ఎవరైనా అవమాన

పరచిన యెడల, శాంతింపుడు. మీ పాదధూళిని అక్కడ దులిపివేయుడు. జాగ్రత్తగా వినుడు. మిమ్ములను తోడేళ్ళమధ్యకు గొర్రెలను పంపినట్లు పంపుచున్నాను. కనుక వివేకముగల్గి, నిష్కపటభావముతో సంచరింపుడు. కిట్టనివారు మిమ్ము సమాజ మంది రములలో బంధించినను మీరు మౌనము పాటించుడు. మీ తండ్రి ఆత్మ మిమ్ము పలి కించినది కావున ప్రభువే వారికి శిక్షామార్గము ఏర్పరచును. అట్టి ప్రదేశమున మీరు నివసింపక వేరొక ప్రదేశమునకు వెళ్లుడు. బోధకునికంటే శిష్యుడు గొప్పవాడు కాడు. పరిచారకుడు యజమానికంటే గొప్పవాడు కాదు. కావున అట్టివారు బోధించిన దానికంటె ఎక్కువగా ప్రవర్తింపరాదు. ఊహించి చెడు తలంపులు ప్రకటించరాదు. కావున నేను చెప్పినది మరచిపోకుడు. నేను బోధించినదియే విస్తృతము చేయుడు. మిమ్ములను ఆదరించినవారు, నన్ను ఆరాధించినవారే యగుచున్నారు. కావున మీరు సావధానముగా విన్న వాక్యముల ప్రకారమే కావించుడు'' అని ఆజ్ఞాపించి వారిని పంపించెను.

## ప్రవక్త యోహాను సందేహము - నివారణ

ఏసుక్రీస్తు యొక్క మహిమలను, ఆయన చేయుచున్న సమస్త కార్యము లను - బాప్తిస్మము యొసంగెడి ప్రవక్త యోహానుకు ఆయన శిష్యులు చెరసాలలో బంధింపబడి యున్నచోటుకు వచ్చి తెలియజేశారు.

వారి మాటలు విన్న సంతోషాశ్రువులు చిందులాడుచుండగా మనస్సు లోనే ప్రభు కుమారుని స్మరించుకున్నాడు. యోహాను తన శిష్యులను జూచి

"మీరు వెళ్ళి ప్రభుకుమారుని దర్శింపుడు. యోహాను అడిగినాడని ఇట్లు అడుగుడు : "ఓ ప్రభు కుమారుడా ! నీవేనా మా సంరక్షకుడవు ? లేక ఇంకొకరి కోసం మేము ఎదురుచూస్తూ ఉండాలా ?" అని అడుగుడు. వెంటనే వెళ్ళిరండు" అని వారలను పంపించెను.

## యోహాను సందేహము విన్న ప్రభు కుమారుడు

వెంటనే యోహాను శిష్యులు ప్రయాణించి, చివరకు ఏసును దర్శించి యోహాను వాక్యములను ప్రభుకుమారునికి తెలియజేశారు. ఏసు వారిని జూచి ఇలా చెప్పాడు.

"మీరు వెళ్ళి ప్రవక్తయైన యోహానుకు తెలియజేయండి. మీరందరునూ చూచియే యున్నారు గదా ! ఆ సంగతియే ఆయనకు తెలియజేయుడు. "గ్రుడ్డి వారు చూపు పొందుచున్నారు. కుంటివారు చకచక నడుస్తున్నారు. కుష్ఠురోగులు తమ రోగము నుండి విముక్తులగుచున్నారు. చెవిటివారు ఆలకించుచున్నారు. రాజ్యాధికార్యాలచే అన్యాయముగ, అకాలమున మరణించినవారు తిరిగి జీవించు చున్నారు. బీదలకు, పరిశుద్ధులకు సువార్త ప్రకటింపబడుచున్నది. కావున ఈ సంగతులు (మీరు విన్నవి - కన్నవి) తెలియజేయుడు" అని వారలను పంపించెను.

# యోహాను సందేహ నివృత్తి

ప్రభుకుమారుని వద్దనుండి సరాసరి బయలుదేరిన యోహాను శిష్యులు చెర సాలలో ఉన్న యోహానును దర్శించి ఏసుప్రభువు యొక్క వాక్యములను విన్న వించాడు.

యోహాను చాలా ఆనందించాడు. "ఈతడే తమను రక్షింపవచ్చిన ప్రభువు" అని గాఢముగా నమ్మాడు. ఆయన తన శిష్యులను జూచి "చూచితిరా ! ప్రభువు యొక్క కృపారసము ! తను సృజించిన ఈ మానవులను కాపాడుటకై ఎప్పుడునూ వేయి కళ్ళతో చూస్తుంటాడు. ఈ విధంగా ప్రభువు అనేకసార్లు ప్రవక్తలద్వారా "ముందు కాపుదలకై ఎవరినో ఒకరిని నియామకం చేస్తుంటాడు. ఇందుకు మీరు దృష్టాంతంగా ఒక కథ చెబుతాను వినండి" అని కథ ప్రారంభించాడు.

## యోనా కథ

**(ఇది పాత నిబంధనలోనిది)**

ప్రభువు సృజించిన "నిన్వేపురము" నందు అనేక చేటులు సంభవించి ప్రజలు దుర్మార్గ ఫలితంగా నశించేటట్లు ప్రభువు గోచరించినది కాబోలు ! ఆ దయామయుడు వెంటనే యోనా ప్రవక్తకు కనబడి "నిన్వేపురమునకు చేటు కలుగ నున్నది. కావున వెంటనే నీవు అక్కడకు పోయి "దేవుని మరచి ఆయన ఆనతి చూపిన సంచరింపకుండా, మద మాత్సర్యములతో సంచరింపకుడు. అట్లా

సంచరించిన మీరేగాక తోడి సహోదరులు కూడ నశింపగలరు. కావున జాగ్రత్తగా మెలగుడు" అని ప్రబోధించమని దేవుడైన యెహోవా యోనాకు ఆజ్ఞాపించెను.

యోనా బయలుదేరెను. కానీ, అతడు దేవుని మాటను నిర్లక్ష్యముచేసి "తార్షీషు" పోవు నావ నెక్కెను. మధ్యదారిలో తుఫాను సంభవించి యోనా సముద్రంలో పడిపోయెను. ఒక తిమింగలము అతనిని మ్రింగినది. తిరిగి దైవకృపవల్ల యోనా బైటపడి నినెవెనగరానికి పోయి ప్రభువాక్యం ప్రకటించాడు. అందువల్ల దుర్మార్గు లుసన్మార్గులయినారు. ఫలితంగా నినెవెనగరం బాగుపడింది.

యోనా తరువాత, ప్రభువాక్యమును "ముందేవచ్చి నినెవెనగరవాసులకు వినిపించలేకపోయానే అని తలచుకొనుచు ప్రాణం విడుచుటకు సిద్ధమయినాడు. కానీ, ప్రభువు తనని కృపతో రక్షించాడు. ఎట్లనగా; యోనా నినెవెనగరానికి చాలా దూరముగా ఉన్న ఒక తోటలోగల పందిరిక్రింద పరున్నాడు. మధ్యాహ్నమైంది. సూర్యుడు బాగా ఎండను వెదజల్లుచున్నాడు. ఆ ఎండ వేడిమికి తన ప్రవక్త యోనా బాధపడరాదని ప్రభువు యోనా శిరస్సు దగ్గర ఒక సొరకాయ మొక్కను సృష్టించాడు. ఆ మొక్క చూస్తుండగనే పెరిగి పెద్దదై యోనాకు నీడ నిచ్చింది. యోనా అది గమనించి విశ్రాంతుడయినాడు. ఎంత తగ్గింది; మొక్క మాయమైంది. యోనా అది కూడ చూశాడు. మొక్క అంత తొందరగా మాయమైనందుకు విచారించసాగాడు.

అప్పుడు ప్రభువాక్యం యోనాకు వినిపించింది. "యోనా ! చూశావుగదా, సొరమొక్కను ? నీవు దానికి నీరు పోయలేదు; పెంచలేదు. హఠాత్తుగా పుట్టింది; నీకు నీడ నిచ్చింది; మాయమైంది. దానికొరకే నీవు బాధపడుచున్నావు. శ్రద్ధగా

వినుము. నేను సృష్టించిన నినేవెపురం ప్రజలు, ఇతర ప్రాణికోటి నశింపనుండగా, నేను చూస్తూ ఊరుకోగలనా? నాకెంత బాధగా ఉంటుంది; గ్రహించావా ? లక్షలాది ప్రజల మరణం గాంచిన నాకెంత ఆవేదన గలుగునో కొంత ఊహించగల్గావా ? ఊహించినచో నీవట్లు ఉపేక్ష చేసేవాడివేనా ? కాబట్టి ఇకముందైనా నీ ధర్మము నీవు నెరవేర్చుము. పశ్చాత్తాపము చెందింది అది చాలును. నీవు మరణింపనవసరం లేదు" అని.

యోనా తన నేరమును సైరించి, కృపారసం వెదజల్లిన ప్రభువును మన సారా నమస్కరించుకొన్నాడు. ఆనాటినుండి తన ధర్మాన్ని విడనాడక, అలక్ష్యాన్ని దూరం చేసుకున్నాడు.

అని యోహాను తన శిష్యులకు యోనా కథను తెలియజేశాడు.

## జకరయ్య కుమారుడు యోహాను మరణం

ఆ తరువాత కొన్ని దినములకే హేరోదురాజు జన్మదినోత్సవం వచ్చింది. ఆ జన్మదినోత్సవ సమయంలో హేరోదు - హేరోదియలకు పుట్టిన పుత్రిక మిక్కిలి శృంగారముగా, సన్నని తెల్లని వస్త్రములు ధరించి చాలా చక్కగా నాట్యము చేసింది. సభాసదులగు రాజోద్యోగులు, సభాసదులు నాట్యాన్ని చూచి మిక్కిలి ఆనందించిరి. ఆ ఆనందసమయంలో హేరోదురాజు పుత్రికను దగ్గరకు పిల్చి "అమ్మా ! నీ నాట్యం నాకేగాక, సభాసదులకు చాలా ఆనందం కలిగించింది. ఈ శుభసమయంలో నీవు ఏది కోరినా, కాదనక తప్పక యిస్తాను" అని వాగ్దానం చేశాడు.

ఆ పుత్రికకు ఏమి కోరుకోవాలో తోచలేదు. ఏమి తక్కువ ఆ రాజ కుమారికకు ! చివరకు ఆలోచించి తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా! నేను ఏమి కోరవలెనో తెలియకున్నది. నీవు ఏది చెప్పెదవూ అది కోరెదను" అని అడిగెను.

హేరోదియ కూతురుమాటలకు మిక్కిలి ఆనందించినది. ఆమెకు యోహానుపై మిక్కిలి కోపము అతనిని వధించుమన్న హేరోదు వధించుటలేదు. వధించిన జన సమూహంలో ఎంతో విప్లవం చెలరేగునని అతని భయం. ఇప్పుడు మంచి సమయం లభించింది. అందువలన ఆమె పుత్రికను జూచి "అమ్మా ! తప్పక నేను చెప్పినదే అడుగుము. కారణం నన్ను అడుగకు. నేను చెప్పినదే కోరుము. అదేమనగా, "జకరయ్య కుమారుడు, బాప్తిస్మము యొసగు యోహాను" యిప్పుడు చెరసాలలో ఉన్నాడు. ఆతని తలను ఖండించి నాకు కానుకగా యిమ్మని కోరుము" అని హేరోదియ పుత్రికను పంపించెను. తల్లిమాటలకు ఆ రాజపుత్రిక, తల్లి చెప్పినట్లు గానే యోహాను శిరమును కోరినది.

హేరోదు ఆ కోరికకు చాల భయపడిపోయినాడు. "యోహానును చంపించిన ప్రజలతో భయము. చంపకపోయిన వాగ్దానం భంగమగును. ఏమి చేయుటకు కొంత సేపు తటపటాయించాడు. "తన వాగ్దానం ప్రకారం హేరోదు యోహానును చంపి నాడేగాని వేరు కాదు" అని ప్రజలు భావింపగలరని నిశ్చయించి, భటులకు "యోహాను శిరమును ఖండించి తీసుకొని రండని" ఆజ్ఞాపించెను. వారు వెంటనే వెళ్ళి చెరసాలలో ఉన్న యోహాను శిరమును ఖండించి, ఒక పళ్ళెములోపెట్టి తీసు కొని వచ్చారు. రాజు తన వాగ్దానం ప్రకారం ఆ పళ్ళెమును పుత్రికకు బహూకరిం చాడు. హేరోదియ మాత్రం చాల ఆనందం చెందింది. యోహాను శిష్యులు వచ్చి "యోహాను శవమును యిప్పింపు"డని కోరగా హేరోదు సమ్మతించాడు. శిష్యులు

ఆ శవమును సమాధిచేసి, ఏసువద్దకు వెళ్ళి, జరిగిన సంగతి తెలియజేశారు.

## 5 వేల మందికి ఆహారం

ప్రభు కుమారుడగు ఏసుకు యీ సంగతి తెలియగానే తన 12 మంది శిష్యులతో బయలుదేశాడు. ఏసు ప్రయాణం చుట్టుపట్టులనున్న గ్రామాలవారం దరకు తెలిసింది. వారందరూ ఏసువెంట బయలుదేరారు.

క్రమంగా వారందరూ "బెత్సయిదా" ప్రాంతానికి చెందిన అరణ్య ప్రాంతానికి వచ్చారు. అక్కడ వారందరూ మకాం చేశారు. చుట్టుపట్ల కనుచూపు మేర ఏ గ్రామాలు లేవు. ప్రభుకుమారుడు ఆ జన సమూహాన్ని చూచి ఎంతో సంతోషించాడు. వారిలో ఆరోగ్యము చెడిన వారందరనూ తన చేతితో స్పృశించి, వార్ని రోగాలను పోగొట్టాడు.

ఏసును జూచి అతని శిష్యులు "ప్రొద్దుపోతుంది. చుట్టుపట్ల పట్టణాలుగాని, పల్లెలుగాని ఉన్నట్లు కనిపించుటలేదు. జనసమూహం 5 వేలకు మించి ఉండునట్లు తోచుచున్నది. మనం "తొందరగా, వారిని వెళ్ళ"మని చెప్పిన వారు తమ ఆహారం గురించి ప్రయత్నించుకుంటారుగదా !" అన్నారు.

ఏసు వారిని జూచి "వారిని ఎందుకు వెళ్ళిపోమని చెప్పాలి ? వారికి కూడ భోజనం మీరే ఏర్పరచండి !" అన్నాడు.

ఆ మాటలకు శిష్యులు ఆశ్చర్యపడిపోయారు. మనవద్ద ఉన్న ఆహారము ఐదు రొట్టెలు, రెండు చేపలు మాత్రమే. మేము వీరందరికి భోజనం కొని పెట్టగలా? ద్రవ్యమేది ? ఆహారం తెచ్చుటకు స్థలం ఎక్కడ ఉన్నది ? అంతా అరణ్యము కదా !" అన్నారు.

"మీరు విచారించకుడు ! వారందరునూ బారులుగా కూర్చోబెట్టండి. వారికి ప్రభువే తిండిని సమకూర్చగలడు" అని పలుకుతూ, తమ వద్దనున్న ఆ ఐదు రొట్టెలను, రెండు చేపలను చేతిలోనికి తీసుకొన్నాడు. ఆకాశంపైపు ఆ ఆహారాన్ని చూపుచు ఏసు యిలా అన్నాడు.

"ప్రభువా ! వీరందరు ఆకలిగొని యున్నారు. నిన్ను నమ్మిన నీ వారికి ఆహారం పెట్టుము" అని ప్రార్థించి ఆ పదార్థాలను శిష్యులకు ఇచ్చాడు.

శిష్యులు ఆ రొట్టెలను, చేపలను చిదిపి, ఆ ఐదు వేల మందికి ఆహారము పెట్టిరి. అందరూ తృప్తిగా భుజించిరి. ఆ రొట్టెముక్కలు, చేపముక్కలు అంత మంది భుజించినను ఇంకను మిగిలిపోయినవి. ఆ మిగిలిన ఆహారమంతయు జన సమూహం 12 గంపలనిండ ఎత్తుకొని పోయిరి.

## ఏసు సముద్రము మీద నడచుట

ఏసు జనాంగమంతయు వెళ్ళినమీదట - ప్రార్థన చేయుటకు - ఏకాంతముగా - ప్రక్కన గల కొండపైకి ఎక్కాడు. శిష్యులు అక్కడ గల సముద్రమును

వారు అవతలి యొడ్డుకు చేరాలని ఒక దోనె యెక్కి అద్దరికి బయలుదేరారు. అప్పటికి బాగా చీకటి ముదిరింది.

ప్రార్థన చేసుకొని ఏసు క్రిందికి దిగివచ్చాడు. దోనె చాలా దూరములో ఉండెను. అందువలన వారిని కలిసికొనుటకు ఏసు సముద్రము మీద నడచుచు వారి వద్దకు బయలుదేరెను.

చీకటి బాగా అల్లుకొని పోవుటచే, సముద్రంపై నడచి వచ్చుచున్న ఏసును గుర్తింపజాలక భూతమని భయపడి కేకలు వేయసాగిరి. అది గాంచిన ఏసు "ఎందుకంత భయం ! నేనే ధైర్యంగా ఉండండి" అన్నాడు.

అంత శిష్యులలో ఒకడయిన పేతురు "ప్రభువా ! నన్ను గూడ నీ యొద్దకు చేర్చుకొనుము. నేనునూ యీ నీళ్ళపై వచ్చి నిన్ను చేరుకుంటాను" అని పలుకుచు నీళ్ళమీద నడవసాగెను. ఇంతలో "ఝూం" అంటూ గాలి పెద్దగా వీచింది. పేతురు భయపడ్డాడు. దృష్టిని ఏసు మీదినుండి తప్పించాడు. గాలివైపు చూడసాగాడు. అందువలన పేతురు నీళ్ళపై నడవజాలక మునిగిపోసాగాడు.

"ప్రభువా ! నన్ను రక్షించు. నీటిలో మునిగిపోవుచున్నాను" అని ప్రార్థించాడు. ఏసు త్వరగా నడచివచ్చి పేతురు చేయి పట్టుకొని, "నీవు పూర్తిగ విశ్వాసం తో లేకపైనావు. అందుకే మునిగిపోవుచున్నావు. ఎందుకు సందేహపడితివి ?" అని పలుకుచు పేతురుతో దోనె యెక్కెను. వెంటనే అంతటి భయంకరమైన గాలి అణిగి పోయింది. శిష్యులందరూ ప్రభుకుమారుని పాదాలపై పడి నీవు నిజముగా దేవుని కుమారుడవే ! మమ్ము కాపాడుము" అని ప్రార్థించిరి.

# గెన్నేసరెతు - రోగనివారణ

వారందరు దోనె గిరి "గెన్నేసరెతు"దేశమునకు వచ్చారు.ఏసు మహిమలు వింటూ, వారిని దర్శించాలనుకుంటూ ఉన్న జనులకు ఏసు రాక ఎంతో ఆనందాన్ని కలిగించింది.

ఎంతోమంది రోగులు ఆ జనసమూహంలో ఉన్నారు. వారందరూ ఏసును దర్శించి సాష్టాంగపడి నమస్కరించారు. ఏసు తన వస్త్రపు చెంగుతో వారిని [illegible]వారించి రోగులను, వారి అందరి రోగములను నివారించాడు. గ్రుడ్డివారు, కుంటివారు, వికలాంగులు, కుష్ఠురోగులు, అంగవిహీనులు మొదలగువారందరూ ఏసువస్త్రమును తగిలినంత మాత్రమున తమ రోగములనుండి విముక్తులైరి.

# కనాను స్త్రీ - ఏసు ప్రభువు

ఆ సమయమునందు సీదోనులి ప్రాంతం నుండి వచ్చిన ఒక కనాను స్త్రీ వచ్చి ప్రభువు నిట్లు ప్రార్థించెను.

"ప్రభువా ! దావీదు వంశీయుడా ! ప్రభుకుమారుడా ! నా మనవి ఆలకించుము. నాకు ఒక్కగానొక్క పుత్రిక. ఆమె చాలాకాలం నుండి దయ్యం పట్టి బాధ పడుచున్నది. ఇంతవరకు ఆమెకు తరుణోపాయము గోచరించలేదు. [illegible] కరుణించుము. నా పుత్రికను ఆరోగ్యవంతురాలిగా చేయు"మని ప్రార్థించెను.

అందుకు ఏసుప్రభువు ఆమె కేమియు సమాధానము చెప్పక ముందుకు బయలుదేరబోయెను. ఆమె పదే పదే ప్రభువును పొగడసాగెను. అప్పుడాయన శిష్యులు ఏసుని జూచి "ప్రభూ! ఆమె మరింత బిగ్గరగా కేకలువేయుచు మనలను వదులుట లేదు. ఆమెకు సమాధానము చెప్పి పంపివేయరాదా? అనిరి.

అప్పుడు ఏసుప్రభువు "నేను ఇశ్రాయేలు వంశీయుల ఇంటివారి గొర్రెల్ని కాపాడుటకు వచ్చినవాడిని. కానీ, నేను ఇతరులవద్దకు రాలేదు" అనెను.

ఆ మాటలు విన్న ఆ స్త్రీ ప్రభువు పాదములముందు మోకరిల్లి "కష్టములో వున్న నా పుత్రికను కాపాడుము" అని మరల ప్రార్థించెను.

ఏసు ఆమెని జూచి "పిల్లలయొక్క రొట్టె తీసికొని - ఇతర పిల్లలకు వేయుట యుక్తము కాదుగదా!" అనెను.

అందుకామె చేతులు జోడించి, "ప్రభువా! అది నిజమే కావచ్చు. ఆ పిల్లలు ఆహారము భుజించినప్పుడు ఆ రొట్టె ముక్కల తునకలు బల్ల మీదనుండి నేల మీద పడునప్పుడు కుక్కపిల్లలు తినుచుండును కదా! ఆలోచింపుము ప్రభూ! మేము కుక్కపిల్లలము, కరుణింపుము" అని ప్రార్థించెను.

అందుకు యేసు "అమ్మా! నీ విశ్వాసము చాల గొప్పది. నీవుకోరినట్టే అగు గాక! నీ పుత్రిక ఆరోగ్యవతి కాగలదు. పోయిరమ్మా!" అని ఆశీర్వదించెను.

ఆ కనాను స్త్రీ వెంటనే తన ఇంటికి పోయి చూచెను. ఆమె కూతురు స్వస్థత చెంది సుఖముగా వుండెను.

## యేసుక్రీస్తు మహిమలు

ఏసు అక్కడ నుండి శిష్యులతో బయలుదేరి గలిలియ ప్రాంతము నందలి సముద్రతీరమునకు చేరుకొన్నాడు. తీరమునకు సమీపమునగల ఒక కొండపై మకాం చేశాడు. ఏసురాక, ఆ చుట్టుపట్లగల గ్రామములందలి జన సమూహామునకు తెలిసినది. వారందరు - ముఖ్యముగా - కుంటివారు. గుడ్డివారు, మూగవారు, అంగ హీనులు - ఏసు ప్రభువును ఆశ్రయించిరి.

ఆ జన సమూహం అనేకులు ఏసు పాదములను స్పృశించినారు. మూగ వారు మాటలాడసాగిరి. అంగవిహీనులు బాగుపడిరి. కుంటివారు నడువసాగిరి. అంధులు చక్కగా చూడసాగిరి. అంతట వారందరు ఏసు మహిమలను ఎంతో కొనియాడిరి.

తరువాత ఏసు తన శిష్యులను పిలిచి యిలా అన్నాడు.

ఈ జన సమూహం నేటికి మూడు దినముల నుండి యిక్కడనే యున్నారు. వెళ్ళుటకు సిద్ధపడుచున్నారు. వారు ఆహారం లేకపోవుటచే మార్గ మధ్యమున స్పృహ తప్పవచ్చును. కావున వారికి తృప్తిగా ఆహారము నొసగి పంపుడు" అనెను.

శిష్యులు చేతులు జోడించి "ప్రభూ ! ఇంత గొప్ప జనసమూహమునకు ఎట్లు ఆహారం నీయగలము. ఇది అంతయు అరణ్య ప్రదేశము. ఆహారము ఎట్లు లభించును ?

వారే బయలుదేరి వెళ్ళి, తమ ఆహారమును సంపాదించుకొనగలరు; వెళ్ళ నీయుడు" అనిరి.

అందుకు ఏసు "వారు ఉపవాసముతో నున్నారు. అట్టి వారి నెట్లు పంప గలను ? మనవద్ద ఎంత ఆహారం ఉన్నవి?" అనెను. వారు వెంటనే "ఏడురొట్టెలు, కొన్ని చిరుచేపలు మాత్రమే ఉన్నవి" అనిరి.

ఏసు వెంటనే జనసమూహమును పరుసలుగా కూర్చుండజేసి, ఆ ఏడు రొట్టెలను, చిరుచేపలను చేతపట్టుకొని "ప్రభువుకు కృతజ్ఞతా స్తుతులు" సల్పి శిష్యులకు యిచ్చెను.

శిష్యులు ఆ కొద్ది ఆహారమును ఆ జనసమూహమునకు ఆహారముగా వడ్డించిరి. అందరును తృప్తిగా భుజించిరి. మిలిగిన ముక్కలుగా 7 గంపలలోనికి ఎత్తిరి. తర్వాత జనసమూహం వారి వారి గ్రామములకు వెళ్ళనవి. ఏసు శిష్యులతో దోనె నెక్కి "మగదాను" ప్రాంతమునకు చేరుకొనెను.

## ఏసు బోధించిన విత్తనముల కథ

ఏసు రాకను మగదాను ప్రాంతంవారు విని, ఆనందంతో వచ్చి ఏసు చుట్టూ మూగారు. ఏసు వారికి ఎన్నో నీతులు ఉపదేశించాడు. ఆ వచ్చిన వారిలో గల అనేకమంది రోగిష్టులను బాగుచేశాడు. ఏసు తన ప్రసంగంలో వారికి సులభంగా అర్థమయ్యే ఒక కథ చెప్పాడు.

"ఒక రైతు తన పొలంలోనికి విత్తనాలు చల్లడానికి విత్తనాలు తీసికొని వెళ్ళాడు. అతడు విత్తనాలు చల్లినపుడు కొన్ని కాలిబాటలో పడ్డాయి; కొన్ని గట్టి నేలమీద పడ్డాయి; మరికొన్ని ముళ్ళపొదల్లో పడ్డాయి; కొన్ని సారవంతమైన పొలంలో పడ్డాయి.

1) కాలిబాటలో పడిన విత్తనాలు దారిని పోయేవాళ్ళ కాళ్ళక్రింద పడి నశించిపోయాయి.

2) గట్టినేలపై బడిన విత్తనాలు నేలలో తడిలేక పోవుటచే - మొలకెత్తి గూడ నశించాయి.

3) ముళ్ళపొదల్లో పడిన విత్తనాలు మొలకెత్తాయి. కానీ, ఆ ముళ్ళ పొదలతో పోటీ చేయలేక నశించాయి.

4) సారవంతమైన పొలంలో పడిన విత్తనాలు అది భూమిలో ఏపుగా పెరిగి, ఒక్కొక్క కంకి, ఎన్నో గింజలచొప్పున విస్తారమైన దిగుబడి (పంట) నిచ్చింది.

దీని భావమేమిటో శ్రద్ధగా వినండి.

దేవుడు పాలించేటప్పుడు అందరినీ సమంగానే చూస్తుంటాడు. కాని, మానవ సమూహం అది గమనింపదు. దేవుని పాలన వారికి రహస్యంగానే ఉంటుంది. అట్టివారు తమకళ్ళతో చూస్తున్నా చూడనట్లే ఉంటారు - చెవులతో వింటున్నా, విననట్లే ఉంటారు. అట్టివారికి యీ కథవలన సులభంగా దేవుని పాలన అర్థమౌతుంది.

**1)** కాలిబాటలో పడిన విత్తనాలు :- దీని భావం ఏమిటంటే, కొద్ది మంది సందేశాన్ని వింటారు; కాని - సాతాను వచ్చి హృదయంలో అపనమ్మకాన్ని కలుగజేస్తుంది. అందువలన వీళ్ళు దేవుని నమ్మజాలరు; క్రొత్త జీవితాన్ని పొంద జాలరు కూడా.

**2)** గట్టి నేలమీద పడిన విత్తనాలు :- దీని భావం ఏమిటంటే, కొద్ది మంది సందేశాన్ని విన్నప్పుడు ఎంతో ఉత్సాహం చూపుతారు; కాని - ఆ ప్రభు సందే శాన్ని హృదయంలో నిల్పజాలరు. కొద్ది క్షణాలు మాత్రమే దేవుని నమ్ముతారు. తరువాత దేవుని మరచిపోతారు.

**3)** ముళ్ళపొదలలో పడిన విత్తనాలు :- దీని భావం ఏమిటంటే, వీళ్ళు కూడా ప్రభుసందేశం వింటారు. కానీ, మనోవేదన - ధనాశ - జీవిత సుఖాలపై గల మోజు - ఇటువంటి వాటికి లొంగిపోయి దేవుని మరచిపోతారు.

**4)** సారవంతమైన పొలంలో భూమిలోపడిన విత్తనాలు :- దీని భావము ఏమిటంటే, వీరు భగవత్ సందేశాన్ని వింటారు. ఆ ప్రకారంగానే జీవితమంతా గడుపుతారు. అట్టివారికి దేవునిపై ఉన్న నమ్మకం ఎప్పటికీ మారదు. మరియు వాళ్ళు దేవుడు కోరే మంచిపనులనే చేస్తుంటారు.

## "సబ్బాతు" దినం గూర్చి తర్కం

ఏసు ఒకానొక సమయంలో ఒక పంటచేను మీదుగా వెడుతున్నాడు. ఆ రోజు "సబ్బాతు" దినం. (అనగా శనివారం-ఉపవాసం చేయవలసిన రోజు)

ఆయన శిష్యులు కొన్ని కంకులు తెంపి, చేతులతో ఆ కంకులను నలిపి ఆ గింజలను తినడం ప్రారంభించారు. అది గాంచిన పరిసయ్యులు ఏసును ప్రశ్నించారు. "ఈ రోజు "సబ్బాతు" చేయగూడనిది చేస్తున్నారు వీరు" అని.

ఏసు యిలా అన్నాడు. "ఆకలితో ఉన్నప్పుడు దావీదుకూడా దేవుని మందిరంలో అతనికి అర్పించిన రొట్టెలను తీసుకొని భుజించాడు; దగ్గరవున్న వారికి గూడ యిచ్చాడు. సబ్బాతు దినానికి ప్రభువు దేవుని కుమారుడే. కావున వీరు చేసినది దోషంకాదు" అన్నాడు.

ఈ విధంగానే ఏసు "సునగోగు"లో కూడ ఒక చేయిపడిపోయిన మనుష్యుని చేయి "సబ్బాతు" దినమందే బాగుపరిచాడు.

ఆ విధంగా ఏసు చేయడం - పరిసయ్యులు, ప్రధాన యాజకులు, సద్దూకయ్యలకు యిష్టంలేదు.

పరిసయ్యులు, ప్రధాన యాజకులు, సద్దూకయ్యులు అనువారు - "ఏసు" మహిమలను వమ్ముచేసి అతనిపై నేరంమోపి, ఎట్లయినా చంపించాలని చూస్తున్నవారు.

ఏసు వాళ్ళందరిని దృష్టిలో పెట్టుకుని, ఇలా హెచ్చరిక గూడ చేశాడు. "ధర్మశాస్త్ర బోధకులమని డాంబిక వేషాలవారు నేడు ఎక్కువగా ఉంటున్నారు. పొడుగాటి అంగీలు వేసుకొంటే సరిగాదు; బజారు వీధులలో హుందాగా తిరుగు, సునగోగుల్లో ఉన్నత పీఠాలను, భోజన పంక్తిలో గౌరవస్థానం పొందడము సరికాదు-ప్రభుసేవలో నిమగ్నమై ఉండాలి వారు. ప్రజలకు సద్బోధ చేయాలి"అన్నా

అది విన్నమీదట, వారికి (పరిసయ్యులు వగైరా) ఏసుమీద యింకనూ ఎక్కువ కోపం వచ్చింది; సమయం కోసం చూస్తున్నారు.

## అసలైన ప్రేమగలవాడు ఎవరు ?

మరియొక సమయంలో ప్రధాన యాజకుడొకడు ఏసునుజూచి యిలా అడిగాడు.

"బోధకుడా! అంతంలేనిది, అసలైనది అగు జీవితాన్ని అనుభవించాలంటే ఏమి చెయ్యాలి ?" అని.

ఏసు ఆయననే యిలా ప్రశ్నించాడు; "మనయొక్క మత గ్రంథంలో ఏమి చేయాలని వ్రాయబడి ఉన్నదో చదివావా?" అని.

అందుకు ఆయన "చదివాను" అందిలా ఉంది. ప్రభువైన నీ దేవుణ్ణి సంపూర్ణంగా ప్రేమించు: అట్టి ప్రేమను నీవు చేసే కార్యాలయందును, తలంచే తలంపులయందును, నీ జీవితమంతటిలోను నింపివేయుము. అంతేకాదు; నిన్ను నీవు ప్రేమించుకొన్నట్లే యితరులను కూడా అట్లే ప్రేమించు" అని ఉందన్నాడు యాజకుడు.

ఏసు అతనిని మెచ్చుకొన్నాడు; "బాగానే చదివావు - నీకు సరైన సమాధానమే దొరికింది గదా! అలాగే చేయి, నీకు అసలైన జీవనం దొరుకుతుంది" అన్నాడు.

ప్రధాన యాజకుడు అంతటితో ఊరుకోలేదు. ఇంకో ప్రశ్న వేశాడు:

"నేను ప్రేమించదగిన ఆ ఇతరులు ఎవరు ? అట్టివారిని ఉదహరించ గలవా ?" అని.

## జాలికల హృదయుంవాడు

అందుకు సమాధానంగా ఏసు ఈ కథ చెప్పాడు.

ఒక ప్రయాణికుడు ఒక ఊరినుండి యింకొక ఊరికి వెడుతున్నాడు. మార్గమధ్యంలో కొందరు దొంగలు అతనిని కొట్టి ఉన్నదంతా దోచుకొన్నారు. కొన ఊపిరితో ఉన్న ఆ ప్రయాణికుణ్ణి రోడ్డుపై పడవేసి వెళ్ళిపోయారు.

కొంత సేపటికి ఆ రోడ్డుపై వెడుతున్న పూజారి ఒకడు, ప్రయాణికుని అతని బాధను చూసికూడ చూడనట్టు వెళ్ళిపోయాడు.

మరికొంత సేపటికి పూజామందిరంలో పనిచేసే అర్చకుడు ఒకడు ఆ రోడ్డు మీదకు వచ్చాడు. ఆయన కూడ పూజారిలాగే చేసాడు. కాని, ఒక నిమిషం ఆగి "అయ్యో ! పాపం" అనుకొని వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కొంతసేపటికి మరియొకడు ఆ రోడ్డుమీదకు వచ్చాడు. అతడు ఆ దేశానికి సంబంధించినవాడుకూడ కాడు. అతడు ఆ రోడ్డుమీద గాయాలతో పడియున్న ప్రయాణికుణ్ణి చూశాడు. ఎంతో జాలి చెందాడు.

వెంటనే అతడు ఆ ప్రయాణికునికి ప్రథమచికిత్స చేశాడు. అతనిని తీసుకొని వెళ్ళి ఒక డాక్టరుకు అప్పగించాడు; తన దగ్గర ఉన్న పైకమునుకూడ యిచ్చి "అయ్యా! ఇతనిని బాగుచేయండి. నేనిచ్చిన పైకం చాలకపోతే, నేను వచ్చి యిస్తాను. పైకం చాలదని, మీరు అశ్రద్ధ చేయవద్దు. ఎంతయినా నేను వచ్చి యిస్తాను" అని చెప్పి వెళ్ళాడు.

ఇంతవరకు కథ చెప్పిన ఏసు - "యాజకుని జూచి ప్రయాణికుని పట్ల జాలి చూపించినవారు ఎవరు ?" అని అడిగాడు.

"దొంగచేతిలో బాధపడినవానిని, తీసుకొని వెళ్ళి డాక్టరుకు అప్పగించి, బాగుచేయుటకు గూడ ధన మొసంగిన మూడవవాడే, పరాయి దేశస్థుడైనను మానవధర్మం నిల్పిన జాలి హృదయం గలవాడు" అని యాజకుడు జవాబు చెప్పాడు.

"నీవు ఆ మూడవవానిలాగే చేస్తే బాగుంటుంది. "జాలిహృదయం" అంటే ఏమిటో, "ప్రేమించదగినవారు" ఎవరో నీకు బాగా తెలిసియే ఉంటుంది," అని ఏసు ఆ ప్రధాన యాజకుని ప్రశ్నకు సమాధానం యిచ్చాడు.

## ఏసు రూపాంతరం చెందుట

ఆ తరువాత యొకనాడు ప్రభుకుమారుడయిన ఏసు తన శిష్యులగు పేతురు, యాకోబు అతని సహోదరుడగు యోహానులను వెంటబెట్టుకొని - ఎత్తయిన ఒక కొండమీదకు వచ్చాడు. అక్కడ ఆయన రూపాంతరం చెందాడు.

రూపాంతరం అనగా మిక్కిలి ప్రకాశవంతమైన రూపము ధరించుట. ఏసుయొక్క వదనం నూరు సూర్యులకాంతివలె ప్రకాశించింది. ఆయన వస్త్రములు మిక్కిలి తెల్లగా అయినవి. మోషేయు, ఏలియాయు ఏసుకు కనబడి మాటలాడుచుండిరి. ఆ దృశ్యమును గాంచిన పేతురు "ప్రభువా ! మన మిక్కడనే నివసింతము. మీ ముప్వురికిని విడివిడిగా ఉండుటకు మూడు కుటీరములు తయారు చేయుదును" అని పలుకుచుండగనే, ఒక దట్టమైన మేఘం వారి పైకి వచ్చింది; చీకటి క్రమ్మినట్లు అయింది.

"ఏసు నా ప్రియ కుమారుడు : నేను సదా ఈతనియందు ఆనందించు చున్నాను. ఈయన మాట వినువారు ధన్యులు" అను శబ్దము ఆ మేఘంనుండి విన్పించింది. ఏసు శిష్యులు-పేతురు, యాకోబు, యోహానులు-ఆ శబ్దంవిని మిక్కిలి తల్లడిల్లిపోయారు. ఏసు వారిని వీపుపై తట్టి "భయము ఎందుకు ?" అని హెచ్చరించాడు. వారు భయముచే కండ్లు మూసుకొని పడిపోయారు కాబట్టి ఏసుయొక్క హెచ్చరికచే-కండ్లు విప్పి తేరిపారచూశారు. ఏసు తప్ప యిక యెవరును వారికి కనిపించలేదు.

వారు కొండదిగి వచ్చునప్పుడు, ఏసు "యీ సంగతి ఎవరికిని చెప్పకుడు," అని ఆజ్ఞాపించెను. పేతురు, "ప్రభువా ! ఏలియా యింకను ముందుకు రాగలడని-యాజకులు చెప్పుచుందురు. ఇదెంతవరకు నిజం ?" అని ప్రశ్నించాడు.

ఏసు - "ఏలియావచ్చి సమస్తమును చక్కదిద్దుననుమాట నిజము. ఏలియా యిదివరకే వచ్చెను. ఆయనను గుర్తించలేక ప్రజానీకం, పురాణాలు చదివిన శాస్త్రులు అవమానించారు; తుదకు తమకు లేకుండ చేసికొన్నారు. ఆయన ఎవరెవరో కాదు; జకరయ్య కుమారుడు, బాప్తిస్మం ఒసగిన యోహానే అని నమ్ముడు.

ఇదే రీతిగనే ప్రభు కుమారుని (ఏసును) కూడ శ్రమలు బెట్టబోవుచున్నారు. ఇది సత్యం" అని తెలియజేశాడు,

## దారితప్పిన కుమారుడు

ఇంకొకసారి ఏసు తన శిష్యులతో బయలుదేరి వెడుతుండగా - మధ్య మార్గములో సుంకరులు (పన్నులు వసూలు చేసేవారు) పాపులు - యేసు బోధలు వినడానికి ఆయనను దర్శించారు. ఆయనకు విందు చేశారు. ఏసు తన శిష్యులతో వాళ్ళ పంక్తిని గూర్చుండి భోజనం చేశాడు. ఈ సంగతి గమనించిన పరిసయ్యులు, శాస్త్రిళ్ళు, యాజకులు యేసును జూచి- "పాపులతోను-సుంకరులతోను భోజనం చేయుచున్నావా ? యిది దోషము కాదా ?" అని ప్రశ్నించారు.

ఏసు వారిని జూచి "వీరు దారితప్పినవారు; సరియైన మార్గానికి వచ్చారు. అట్టివారిని ఆదరించాలిగాని అవతలికి నెట్టివేయరాదు. మీకు దృష్టాంతముగా ఒక కథ చెబుతాను వినండి" అని ఈ దిగువ కథ చెప్పాడు.

"ఒక ధనవంతునికి ఇద్దరు కుమారులు ఉన్నారు. పెద్దవాడు తండ్రిమాట జవదాటకుండా ఉండేవాడు, మంచి సుగుణాలను అలవర్చుకొన్నాడు. చిన్నవాడు అట్లుగాక, దుర్వ్యసనాలకు లోనయి తండ్రిమాటను వినక తిరిగేవాడు.

ఒకనాడు తండ్రి మందలించాడు. చిన్న కుమారుని - "ఇట్లా తిరగడం మంచిదికాదు నాయనా !" అని.

కాని - ఆ కుమారుడు వినలేదు. పైగా "నా వాటా నాకు ఇచ్చివేస్తే బాగుంటుంది." అని ఎదిరించాడు. తండ్రి కొంచెం ఆలోచించాడు. చివరకు తన ఆస్తిని రెండుభాగాలు చేసి, ఒక భాగాన్ని చిన్న కుమారునికి ఇచ్చివేశాడు.

క్రమంగా చిన్న కుమారుడు సరైన మార్గంలో లేనందువల్ల ఆస్తిని పోగొట్టుకొన్నాడు. అక్కడనుండి వేరొక ఊరు వెళ్ళిపోయాడు. అదే సమయంలో దేశంలో కరువు వచ్చింది. చేతిలో డబ్బులేని ఆ చిన్నకుమారుడు ఎంతో యిబ్బందుల పాలయినాడు.

ఆకలిబాధకు తట్టుకోలేముగదా ! అందువల్ల అతడు ఒక రైతును ఆశ్రయించాడు. ఆ రైతుకు ఎన్నో పందులు ఉన్నాయి. "రోజూ ఈ పందులను మేపుకొని వస్తే నీకు తిండి పెడతాను" అని రైతు చెప్పాడు. అందుకు ఆ చిన్న కుమారుడు సమ్మతించి పనిలో చేరాడు.

కొద్ది రోజులకే ఆ బాలుడు పందులుమేపే పని చేయజాలకపోయాడు. రైతు పెట్టే ఆహారం అతనికి సరిపోయేదికాదు. అప్పుడు అతనికి తండ్రి జ్ఞాపకం వచ్చాడు. "నా తండ్రి ఇంటిలో పనిచేసే పాలేరువాళ్ళకు గూడ మంచి ఆహారమును పెట్టేవాడు. కాని, ఇంతపని చేస్తున్నా ఈ యజమాని సరిగా తిండి పెట్టుటలేదు. ఇక నేను నా తండ్రిని ఆశ్రయించుటయే మంచిది" అని నిశ్చయించుకొని తండ్రివద్దకు చాల కష్టముమీద చేరుకొన్నాడు.

తండ్రి కుమారుని ఎంతగానో ఆదరించాడు. మిక్కిలి ప్రేమతో కౌగలించుకొన్నాడు. ఆ చిన్న కుమారుడు తండ్రి పాదములపై పడి "నేను చాల తప్పుచేశాను దేవుని, నిన్ను మరచిపోయాను. అందులకే నాకు ఈ గతి పట్టింది. నన్ను నీ పాలేరుగానైనా స్వీకరించు" అన్నాడు.

తండ్రి హృదయం జాలితో నిండిపోయింది. "నాయనా ! నీ తప్పు నీవు తెలుసుకున్నావు; భగవంతుడు తప్పక నిన్ను కరుణిస్తాడు. మంచి దారిలోకి వచ్చావు. నీవు మరల క్రొత్తగా జన్మించిన వాడవయ్యావు. పాతవి మరచిపో.

సరైన మార్గాన్ని నడవటం నేర్చుకో !" అని. ఆ రోజు సంతోషముతో గొప్ప విందుకూడ చేశాడు : బంధువులుకూడ వచ్చి-బాలునిఆశీర్వదించారు. అని ఏసుకథ చెప్పి - "పాపులను సరైన మార్గాన్ని - మంచి నీతులవల్ల పొందగలుగుతారు" అన్నాడు.

## ఏసు - ఒక ధనవంతుడు

ఏసు తన శిష్యులతో గలిలయ ప్రాంతంనుండి యోర్దాను నదీతీరంలో ప్రయాణం చేస్తున్నాడు. ఆయన రాక విని అనేకమంది వచ్చి ఆయనను దర్శించారు. అప్పుడు ఒక ధనవంతుడు ఏసును దర్శించి, ఇలా అడిగాడు.

"ఓ ప్రభుకుమారుడా ! నాకు సమస్తమూ ఉన్నది. నేను నిత్య జీవనము చేయుచూ, ఆనందము పొందుటకు ఏమి చేయవలెను ?" అని.

ఏసు అతనిని చూచి "మంచి కార్యములు చేయుచు ఆనందం పొంద వచ్చును. అవి ఏవి అనగా:- ఒకరిని హింసించవద్దు. వ్యభిచరించుట, దొంగిలించుట కూడ సౌఖ్యములు ఇచ్చుట - ఇట్టివి మంచివికావు. వీటిని విడనాడాలి. తల్లిదండ్రు లను సన్మానించాలి. సద్బుద్ధితో పోషించాలి. నిన్ను నీవు ప్రేమించుకున్నట్లు - పొరుగువారిని కూడ ప్రేమించాలి. ప్రభువు సూచించిన నీతులను సదా ఆచరించు చుండాలి" అనెను.

"అలా చేసిన యెడల పరిపూర్ణమైన ఆనందం లభించునా ?" అని తిరిగి ధనవంతుడు అడిగాడు.

ఏసు వారిని జూచి "పరిపూర్ణమైన ఆనందం నీకు కలుగవలెనంటే - నీ [illegible]ని సర్వమూ అమ్మి బీదలకు పంచిపెట్టుము. నీవు నా వెంట రమ్ము" అని చెప్పె[illegible].

ధనవంతుడు అందుకు సమ్మతింపలేదు; సరిగదా, అటునుండి వెళ్ళిపో[illegible]ను

ఏసు శిష్యులను జూచి "లోభిని ఎవ్వరు బాగుపరచగలరు ? లోభిని [illegible]గు పరచేకంటే "సూది బెజ్జములో ఒంటెను దూర్చుట మిక్కిలి సులభం" అని చె[illegible]- పేతురు "మేము సమస్తమూ విడిచి నిన్ను వెంబడించాము. మాకు పరలోక [illegible]ం లభిస్తుందా ?" అన్నాడు. "మీరు పండ్రెండుమంది మనుష్య కుమారుడు (ఏసు) పునర్జన్మమందు - మీరు పండ్రెండు గోత్రముల వారికి తీర్పు తీరుస్తారు. పర[illegible]క రాజ్యములో సుఖంగా ఉంటారు. ప్రభు నామమును సదా తలంచెడివారు ఎన్నడును చెడిపోరు. వారు చిరస్థాయిగా ప్రకాశిస్తూ ఉంటారు. ప్రభు సింహాసనమునకు ఇరు ప్రక్కలా సింహాసనాలపై ఆసీనులై యుంటారు" అన్నాడు.

## జక్కయ్య - ఏసుప్రభువు

ఒకనాడు ఏసు "యెరికో" అను నగరముగుండా వెడుతుండగా - ఆ[illegible]ను చూచుటకు అనేకమంది వచ్చి, ఆయన చుట్టూ మూగారు.

ఆ నగరంలో జక్కయ్య అనువాడు ఉన్నాడు. అతడు రోమాప్రభుత్వా[illegible]. పన్నులు వసూలు చేస్తుంటాడు. అతడు చాల పొట్టివాడు. అతనికి ఏసును [illegible] లని ఎన్నాళ్ళనుండియో కోరిక ఉంది. ఆయనమీద ఎంతో నమ్మకము గూ[illegible].

పొట్టివాడైన జక్కయ్య ఏసును చూడాలని కొంతదూరం ముందు[illegible] ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు. అదే మార్గంలో ఏసు వచ్చునప్పుడు ఆ[illegible] దర్శించాలని జక్కయ్య కోరిక.

ఏసు క్రమంగా తన శిష్యులతో ఆ చెట్టు క్రిందికి వచ్చాడు. రావడంతోనే ఏసు పైకి చూస్తూ జక్కయ్య "తొందరగా చెట్టుదిగి రావయ్యా ! ఈరోజు మీ ఇంటి లోనే నాకు ఈ నా శిష్యులకు విందు" అన్నాడు. జక్కయ్య సంతోషంగా చెట్టు దిగి వారిని తన యింటికి తీసుకొని వెళ్ళాడు.

జక్కయ్య మిక్కిలి ఆనందంతో వారిని గౌరవించాడు. మంచి ఆహారాన్ని సమకూర్చాడు.

"ప్రభూ ! రక్షించు. ఇక్కడి ప్రజలు అందరూ నన్ను ద్వేషిస్తున్నారు. పన్నులు వసూలుచేయు పని నాది. నా ధర్మాన్ని నేను చేస్తున్నాను. కాని ప్రజలు నన్ను శత్రువుగాను, పాపిగాను చూస్తున్నారు. నాకు చాల ఆస్తి ఉంది. అది పేద ప్రజలకు ఇచ్చివేస్తాను. మోసగించి ఎవరివద్ద నేను ఎక్కువ పన్నులు వసూలు చేయ లేదు. చేశానని వారంటే, నాలుగింతలు కోరినా ఇస్తాను" అన్నాడు.

ఏసు ఇలా అన్నాడు. "ఈరోజు నీకు, నీ కుటుంబానికి పవిత్రమైన దినం. దేవుడు నీకు క్రొత్తజీవనాన్ని ప్రసాదిస్తాడు. పరలోకరాజ్యాన్ని అనుగ్రహిస్తాడు" అన్నాడు. మరియు అక్కడ గల ప్రజలను చూచి "మీరు అన్యోన్యంగా ఉండాలి. దేవుడు మిమ్ములను అనుగ్రహిస్తాడు. మీ కష్టాలను నివారిస్తాడు. మీ అనారోగ్యాన్ని దూరం చేస్తాడు. మీరు అందరూ ఒకరినొకరు ప్రేమించుకుంటూ హాయిగా ఉండండి. వేషధారులైన శాస్త్రుల మాటలు, పరిసయ్యుల మాటలు నమ్మకుడు. వారు సున్నము కొట్టిన సమాధులవంటివారు. సమాధులు పైకి శృంగారముగా కన్పించినను లోననంతయు అస్థికలే ఉండునుగదా ! వీరును అలాగేనని నమ్ముడు.

పైకి వీరు నీతిమంతులుగా కన్పించినను, వీరి హృదయం మాత్రం మంచిది కాదు. స్వార్థముతోను కుళ్ళుతోను నిండియున్నవారు. కావున ప్రభు వాక్యములపై విశ్వాసము నుంచుడు" అని బోధించెను.

## ప్రధాన యాజకులు - ఇస్కారియోతు

ఏసు హితబోధలు అన్నీ ఒక్కొక్కటి - తమ చెవులకు వినిపిస్తున్నకొద్దీ - ప్రధాన యాజకులకు, పరిసయ్యులకు, సద్దూకయ్యులకు చాల కోపము కలిగిస్తూ వచ్చింది. అందువల్ల ఆ నాయకులందరూ ఏసును చంపించాలని, చంపాలని విశ్వ ప్రయత్నాలు చేయసాగారు.

ఆఖరికి వారందరూ ఏసు శిష్యులలో ఒకడగు ఇస్కారియేతును కలుసుకొని వానిని తమవానిగా చేసికొన్నారు. "నీవు ఎట్లయిన వానిని నమ్మించి బంధింప జేయాలి. నీవు యూదాపు యూదువ దేశానికి మేలు చేయాలి. యూదువ వంశాన్ని ఏసు తన బోధవలన తనవారిని చేసికొనుచున్నాడు. అతడు గలలీయుడు. వానికి తగిన శిక్ష విధించాలి. ప్రజలు చాలామంది ఇప్పటికే ఏసుపై కోపం వుంది.అట్టివారిని మేము చాలమందిని తయారుచేసియే ఉంచాము. కావున నీవు తగిన సమయంలో ఏసును బంధించుటకు తోడ్పడుము. నీకు 30 వెండినాణెములు ఇస్తాము" అన్నారు. ఇస్కారియేతు యూదావారి మాటలకు, లంచానికి లొంగిపోయాడు.

"నేను సమయం చూచి ఏసు చేతిని ముద్దుపెట్టుకొందును. మీరు వెంటనే కత్తులు, గుదియలు మొదలగు ఆయుధములతో వచ్చి ఏసును బంధించుడు" అని ఇస్కారియేతు యూదావారికి సంజ్ఞ చేశాడు.

## పస్కాపండుగ - ఏసు విందు

అప్పటికి పస్కాపండుగ రెండురోజులు ఉన్నది. ఏసును బంధించాలని చూస్తున్నవారు "పస్కాపండుగ దినాల్లో ఆయనను బంధించితే ప్రజలలో కలకలము పుడుతుందని" భావించి సమయంకోసం చూడసాగారు.

పస్కా పండుగ మొదటిరోజున గొర్రెలను అర్పించే రోజు. ఏసు తన శిష్యులను జూచి "ఎక్కడ పస్కా పండుగ చేయాలో మీకు చెబుతాను. మీరు ఆ విధంగా చేయండి. మీరు పట్నంలోకి వెళ్ళండి. మీకు నీళ్ళకడవ మోస్తున్న ఒక వ్యక్తి కనిపిస్తాడు. ఆయనకు నా మాటగా మీరు చెప్పండి. అంతా ఆయన సిద్ధం చేస్తాడు" అన్నాడు.

శిష్యులు వెళ్ళారు. అంతా యేసు చెప్పినట్లే జరిగింది. సాయంకాలం ఏసు తన పన్నెండుమంది శిష్యులతో ఆ గృహానికి వెళ్ళాడు.

## ఏసు తుదిసారిగా ప్రభువును ప్రార్థించుట

భోజన సమయంలో ఏసు శిష్యులను జూచి "మీలో ఒకడు - ఇప్పుడు ఇక్కడ భోజనం చేస్తున్నవారిలో ఒకడు - నన్ను పట్టి బంధింపజేసి రోమీయులకు అప్పగిస్తాడు" అన్నాడు.

శిష్యులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"నాతోబాటు ఇదే పాత్రలో రొట్టె ముంచి తినుచున్నాడు. అతను ఆ పని చేయకపోతే బాగుపడతాడు. చేసినచో నశించిపోతాడు" అన్నాడు ఏసు.

తిరిగి శిష్యులు ముఖాలు చూసుకున్నారు. ఏసు రొట్టెముక్కను శిష్యులకు యిస్తూ "తీసుకోండి. ఇది నా శరీరం. ఈ పాత్రలోనిది ద్రాక్షరసం. దీనిని త్రాగండి. ఇది అనేకుల కోసం ప్రాణం చిందించే ప్రభు (ఏసు) కుమారుని రక్తం అని భావించండి" అన్నాడు.

శిష్యులు రొట్టె భుజించారు. రసం త్రాగారు. తర్వాత వారందరూ "గెత్సెమన్" అను చోటికి వచ్చారు. ఏసు వాళ్ళను జూచి "మీరిక్కడ కూర్చోండి" అని పేతురును, యాకోబును, యోహానును తీసుకొని పైకి వెళ్ళాడు. వాళ్ళ

ముగ్గురిని అక్కడ ఉండమని చెప్పి యింకా పైకి వెళ్ళాడు. ప్రభువును తుదిసారిగా ప్రార్థించుకున్నాడు.

"ప్రభూ ! తండ్రీ ! నీకు సమస్తమూ తెలుసు. ప్రజలను కాపాడు. ఈ శోకపాత్రను యికను నానుండి తొలగించు. అయినా నా ఇష్టంగా భావించకు; నీ చిత్తమేనని భావించుము" అని ప్రార్థించాడు.

ప్రార్థనానంతరం ఏసు పేతురువద్దకు వచ్చి వాళ్ళను లేపాడు. "మీరింత వరకూ నిద్రిస్తున్నది చాలు. ఇకలేవండి. ప్రభు కుమారుడు పాపుల చేతులలోకి వెళ్ళు సమయం ఆసన్నమైంది" అంటూ క్రిందికి వచ్చారు అందరూ. తక్కిన శిష్యులు కూడ సిద్ధంగానే ఉన్నారు. ఏసును చూడడానికి ఎంతో మంది జనం కూడా వచ్చారు అక్కడకు.

## ఏసును బంధించుట

అప్పటికి అర్ధరాత్రి దాటింది. యెరూషలేమునకు అనుకొని ఎక తోట ఉంది. ఏసు, ఆయన శిష్యులు, జనసమూహం ఆ తోటలోనికి చేరుకున్నారు. ఏసు ఆ తోట చివర భాగమువరకూ వెళ్ళాడు. అక్కడ ఆయనకు ఒక గుంపు కన్పించింది. వారు ఆయనవైపే వస్తున్నారు. వెంటనే ఆయన శిష్యులలో ఒకడగు ఇస్కారియోతు యూదా, ఏసును సమీపించి ఆయన చేతిని "ముద్దు" పెట్టుకున్నాడు.

అప్పుడు ఆ వస్తున్న పుంపులోనివారు అందరూ కత్తులూ, గుదియలూ పట్టుకొని ఏసును చుట్టుముట్టారు. ప్రధాన యాజకులు, శాస్త్రిళ్లు, పరిసయ్యులు నాయకులు - అందరూ - ఆ గుంపును వెంబడించియే యున్నారు. వారందరినీ చూశాడు ఏసు.

"యూదా ! మనుష్య కుమారుని (నన్ను) ముద్దు ఇచ్చి పట్టిస్తున్నావా?" అన్నాడు.

వచ్చిన గుంపును, జరుగబోవునది గుర్తించిన ఒక శిష్యుడు - వెంటనే ఇంకొకని ఒరలోనున్న కత్తిని దూసి విసిరాడు. ఆ దెబ్బకు ఒక యాజకుని కుడి చెవి తెగి, భుజానికి గాయం అయింది.

ఏసు ఆ శిష్యుని ఆపుచేశాడు. ప్రధాన యాజకులతో యిలా అన్నాడు.

"మీరు దొంగలమీదికి వచ్చినట్లుగా కత్తులు, లాఠీలుపట్టుకొని నా మీదికి యీ అర్ధరాత్రి సమయాన రావాలా ? నేను మీతోబాటు ప్రతిరోజు దేవాలయంలోనే ఉంటున్నాను గదా ! అక్కడ నన్ను పట్టుకోలేదు. ఇది చీకటి ఏలే సమయం; మీకు అనుకూలమైన సమయం" అన్నాడు.

ఆయన మాటలు వారెవరూ పట్టించుకోలేదు. వచ్చి ఏసును బంధించారు. ఏసును బంధించుటతో శిష్యులందరూ భయంతో పారిపోయారు.

ఆ గుంపు యేసును బంధించి "రోమా" గవర్నర్ అగు పిలాతు (మండలాధిపతి) దగ్గరకు తీసికొని పెళ్ళారు.

## యేసును పిలాతు విచారణ చేయుట

అప్పటికి తెల్లవారింది; ప్రధాన యాజకులు, ధర్మశాస్త్ర పండితులు, నాయకులు, కూడ సాక్ష్యాలకు నియమింపబడినవారు అందరూ ఏసును పిలాతు వద్దకు తీసుకొని వచ్చారు.

"ఏసు అనబడే యీ వ్యక్తి చాలా చాలా నేరాలు చేశాడు. ప్రజలను ప్రభుత్వానికి ఎదురు తిరుగుమని రెచ్చగొట్టాడు" అని వారందరూ ఏసుమీద ఏవేవో నేరాలు ఏకరువు పెట్టారు.

"రోమా ప్రభుత్వానికి పన్నులు కట్టవద్దనీ, ప్రజలందరి మీదా రాజుగా ఉండుమని దేవుడు నన్ను మీ రాజుగా పంపించాడని" ఏసు చెప్పాడని మరికొందరు చెప్పారు.

పిలాతు ఏసును జూచి ఏవయ్యా ! నీవు యూదులకు రాజువా ?" అని అడిగాడు.

"ఆ మాట నీవు నమ్ముచున్నావు గదా !" అని యేసు అన్నాడు.

"ఇతడు యూదా ప్రాంతమంతా తిరిగాడు 'ప్రభుత్వానికి వ్యతిరేకంగా

కత్తి పట్టండి' అని గూడ ప్రజలను రెచ్చగొట్టాడు. అలాగే తన ప్రదేశమగు గలిలియ ప్రాంతమంతా ప్రచారం చేశాడు. ఇక్కడకు గూడ అదే ఉద్దేశంతో వచ్చాడు" అని కూటసాక్ష్యాలు పలికారు కొందరు.

పిలాతు అప్పుడు "ఈతడు గలిలియుడా ? అయినచో - ఇతను హేరోదు యిలాకాలోని వాడు. హేరోదు ఇప్పుడు యెరూషలేములోనే ఉన్నాడు" అని పలికి ఏసును హేరోదు వద్దకు పంపించాడు.

గలిలియ రాజైన హేరోదు - పిలాతుచే పంపబడిన ఏసును చూచి ఎంతో సంతోషించాడు. అతడు ఏసును గూర్చి, ఆయన మహిమలను గూర్చి చాలా సంగతులను విన్నాడు - కావున ఏసును చూడాలని అనుకుంటున్నాడు కాబట్టి ఆయన రాక హేరోదుకు సంతోషం కలిగించింది.

యేసు తన దగ్గర ఏమైనా అద్భుతాలు చేస్తాడేమో చూడాలని హేరోదు యేసును ఎన్నో ప్రశ్నలు వేశాడు కాని ఒక్క ప్రశ్నకు గూడ యేసు సమాధానం చెప్పలేదు.

యూదుల అధికార్లు మాత్రం యేసుపై ఎన్నెన్నో నేరాలు చేశాడని హేరోదుకు చెప్పారు.

మత బోధకులు - పరిసయ్యులు మొదలగువారు "తాము చేస్తున్న చెడు కార్యాలు అన్నీ" యేసే చేసేడని హేరోదుకు విన్నవించారు. అన్నీ ఆలకించి యేసు మందహాసం చేశాడుగాని, పెదవి విప్పలేదు.

హేరోదుకు యేసుపై దురభిప్రాయం కల్గలేదు. అందువల్ల యేసును పిలాతు వద్దకే పంపివేశాడు.

## పిలాతు తీర్పు - మరణశిక్ష

హేరోదు వద్దనుండి తిరిగివచ్చిన యేసు విచారణకు పిలాతు - యూదుల నాయకులను, మిగతా నాయకులను సమావేశపరచాడు.

పిలాతు యిలా అన్నాడు :- గలిలియ ప్రాంతంవాడైన యీ యేసు అనబడే ఈ వ్యక్తి "ప్రభుత్వానికి విరుద్ధంగా ప్రవర్తించండి అని ప్రజలను రెచ్చగొడుతున్నాడని అంటున్నారు. నాకు సరైనదిగా మీ వాదన కనిపించుటలేదు. నేను

విచారణ చేసియే గదా! హేరోదురాజు వద్దకు పంపించిచాను. ఆయనకు గూడ యేసుపై, మీరు వేసినవన్నీ అభాండాలని తోచింది కాబోలు! ఆయన నమ్మలేదు. తిరిగి నావద్దకే పంపించాడు. మరణశిక్షకు తగిన నేరమేమీ ఇతనిలో లేదు. కావున అతనికి "కొరడా దెబ్బలు కొట్టండి" అని తీర్పు యివ్వాలని అనుకుంటున్నాము. అన్నాడు.

అందుకు ప్రధాన యాజకులు మొదలగు వారు సమ్మతింపలేదు. వారివల్ల లంచం తిన్నవాళ్ళంతా "ప్రభు కుమారుడనని చెప్పుకుంటున్న యీ యేసును సిలువ వేయించండి" అని కేకలు వేయసాగారు.

అందుకు వారికి ఒక అనుకూలం కూడా దొరికింది. అదేమనగా ఆరోజు పండుగ (పస్కారోజు) ఆ రోజున రోమా గవర్నరు ఒక ఖైదీని విడుదల చేయడం అలవాటు.

"బరబ్బా" అనువాడు ఒక పాతఖయిదీ. వాడు ఏన్నో నేరాలు చేసాడు; హత్యలూ చేశాడు. వాడు ఈ యాజకులకు మిత్రుడు. వీడు ఉంటే తమకు అన్ని విధాల సాయం ఉంటాడని ప్రధాన యాజకుల ఉద్దేశం. అందువల్ల వారివల్ల లంచాలు తిన్నవారు అందరూ పిలాతును జూచి యిలా అన్నారు.

"యేసును చంపండి; బరబ్బాను విడిపించండి. పస్కాపండుగ సమయంలో ఖైదీని విడిపించుట మామూలే గదా!" అని.

పిలాతుకు ఏమి చేయాలో తెలియుటలేదు. జనసమూహమంతా ఒకటే మాటగా "యేసుకు సిలువ వేయండి" అంటున్నారు. ప్రజావాక్యం మన్నించడానికి అతని మనస్సు అంగీకరించుటలేదు.

అయినా యిలా అన్నాడు పిలాతు: "బరబ్బాను విడుదల చేయిస్తాను. కానీ, ఏసును సిలువ వేయడానికి తగిన నేరం ఏమి ఉందని. కాబట్టి ఇతనిని కొరడా దెబ్బలతో శిక్షిస్తాను" అని.

జనసమూహం సమ్మతించలేదు. ఆ గుంపు అంతకంతకు ఎక్కువయింది. "ఏసును చంపాలి" అన్న కేకలు యెక్కువయ్యాయి.

ఆ కేకలకు పిలాతు అదిరిపోయాడు. అందువల్ల "బరబ్బాను విడుదల చేస్తున్నాను. ఏసును సిలువ వేయడానికి సమ్మతిస్తున్నాను" అని ప్రకటించివేశాడు.

జనసమూహమంతా ఆనందంతో గంతులు వేస్తూ - నగరం వెలుపలకు ఏసును సిలువ వేయడానికి రాజభటులు తీసుకొనిపోయారు.

## ఏసును సిలువ వేయుట

రాజభటులు ఏసుతో వెళుతుండగా మార్గమధ్యంలో కురేను దేశానికి సంబంధించిన సీమోను అనువాడు ఎదురయ్యాడు. అతడు తన గ్రామం నుండి నగరంలోకి వస్తున్నాడు. అతనిని రాజభటులు పట్టుకొని, సిలువ అతనిమీద పెట్టి "మా వెంట రా" అని హుకుం చేశారు. సీమోను వారివెనుకే నడవసాగాడు సిలువతో.

పెద్ద జనసమూహం వారివెంట బయలుదేరింది. వారిలో స్త్రీలు కూడా ఉన్నారు. వారు ఏసును చూచి ఎంతో దుఃఖించసాగారు. అందరూ సిలువ వేసే చోటుకు వచ్చారు. అదే సమయంలో కొందరు రాజభటులు ఇద్దరు దొంగలను కూడా ఉరితీయడానికి తీసుకువచ్చారు.

అందరూ గొల్గోతా (కపాలస్థలం) అను చోటికి చేరారు. అదే సిలువ వేసే ప్రదేశం. రాజభటులు ఏసుమీద గల వస్త్రాలను ఊడదీసి వేశారు. ఆ వస్త్రాలను వారందరూ తర్వాత పంచుకున్నారు చీట్లు వేసి.

అక్కడ ఏసును (సిలువ మ్రానుకు) చీలలతో అంటగొట్టారు. ఏసు

ప్రభువు వారినుద్దేశించి "ప్రభువా ! వీళ్ళను క్షమించు. ఏమి చేస్తున్నారో వీళ్ళకే తెలియదు" అని ప్రార్థించాడు.

ఏసుకు ఎడమప్రక్కన ఒకరిని, కుడిప్రక్కన ఒకరిని - ఆ తీసికొని వచ్చిన దొంగలను సిలువ వేశారు. యూదుల నాయకులు మొదలగువారు ఏసును చూచి "దేవుని కుమారుడనని అన్నావు గదా ! నిన్ను నీవు రక్షించుకోజాలని నీవు దేవుని కుమారుడవా ?" అని హేళన చేశారు. తర్వాత వారు ఏసు చేతులను సిలువపై వుంచి మేకులు చేతులలోంచి సిలువకు అంటగొట్టారు. పాదములు కూడా సిలువపై వుంచి ఆ పాదములలో నుంచి మేకులు దిగునట్లు సిలువకు అంటగొట్టారు. తర్వాత ఆ సిలువను పైకెత్తి ఏసు సిలువమీద చనిపోయినట్లు వ్రేలాడనిచ్చారు.

అప్పుడు మధ్యాహ్నం 12 గంటలయింది. ఆతర్వాత మూడు గంటలవరకు సూర్యుడు కనిపించలేదు. అంతా చీకటి అయిపోయింది. ఏసు పెద్ద కంఠంతో "తండ్రీ ! నా ఆత్మని నీ చేతులలో ఉంచుతున్నాను" అని పలుకుతూ ప్రాణం విడిచిపెట్టాడు.

ఈ దృశ్యం చూచిన చాలామంది జనులు దుఃఖంతో రొమ్ము బాదుకుంటూ యిళ్ళకు వెళ్ళిపోయారు.

ఏసుపై నమ్మకమున్న గలిలియ ప్రాంతంవారు కూడా అక్కడ ఉన్నారు. వారిలో స్త్రీలు కూడా ఉన్నారు. వారంతా సిలువకు కొంతదూరంలో ఉండి జరిగినదంతా చూశారు.

## ఏసు సమాధి చేయబడుట

యూదయ ప్రాంతములో గల "ఆదిమతయ" అను గ్రామ నివాసియైన యోసేపు అనువాడు నీతి వర్తనుడు, దైవరాజ్యాల కొరకు ఎదురు చూస్తున్న మంచి

వాడు. అతను యూదుల మహాసభలో ఒక సభ్యుడు కూడ అయినప్పటికీ వాళ్ళ తీర్మానాలకు, చర్యలకు ఒప్పుకునేవాడు కాడు. దేవుడు మహారాజుగా వచ్చే కాలం కొరకు ఎదురు చూచేవాడు.

అట్టి సద్గుణములు గల యోసేపు - పిలాతువద్దకు వెళ్ళి "ఏసు దేహాన్ని నాకు ఇప్పించండి !" అని ప్రార్థించాడు. పిలాతు సంతోషంతో అంగీకరించాడు. యోసేపు ఏసు దేహాన్ని క్రిందకు దించి (సిలువనుంచి) నారబట్టను ఏసు శరీరంపై కప్పి - ఒక సమాధి వద్దకు తీసుకొని వెళ్ళాడు. గలిలయ వాసులగు స్త్రీలు-ఆయనకు (యోసేపు) సహాయంగా నిలబడ్డారు. ఆ సమాధి ఒక రాతిలో తొలచబడింది. అందులో అప్పటివరకు ఎవ్వరినీ ఉంచలేదు. ఆ రోజు శుక్రవారం. కొద్ది సమయానికే సబ్బాతుదినం (శనివారం) ఆరంభము అవుతుంది.

తరువాత వారు ప్రభుకుమారునికి ధర్మశాస్త్ర ప్రకారం అభిషేకించుటకు గంధం, అత్తరు సిద్ధం చేయుటకు వెళ్ళారు.

సబ్బాతు దినం - ఎవ్వరూ పని చేయరాదు. ఆ రోజున యోసేపు, ఆ స్త్రీలు ముప్వురూ శనివారం సమాధివైపు వెళ్ళలేదు.

యోసేపుతో ఉన్న స్త్రీలు ముప్వురు. వారు 1) మగ్దలేనే మరియ 2) యాకోబు, యోసే తల్లియగు మరియ, 3) జెబెదయి కుమారుల తల్లియగు యోహన్న.

## ఏసు పునరుత్థానం

సబ్బాతు దినం (శనివారం) గడిచిపోయింది. ఆదివారం తెలతెల్లవారు తుండనగానే యోసేపు, ఆ స్త్రీలు ముప్వురూ ఏసు శరీరాన్ని అభిషేకించడానికి సుగంధ ద్రవ్యాలతో సమాధివద్దకు వచ్చారు.

వారు సమాధి దగ్గరకు చేరుకునేసరికి "సూర్యోదయం" అయింది. సమాధి ద్వారాన్ని మూసివేయుటకు వేయబడిన ఆ పెద్దరాయి దొర్లిపడి ఉండడం చూశారు.

"అంత పెద్దరాయిని ఎవరు త్రోసివేశారు ?" అని వారు భావిస్తూ లోనికి వెళ్ళారు. ప్రభువు దేహం అందులో లేదు. ఒక తెల్లని అంగీ వేసికొన్న ఒక యువకుడు వారికి కనిపించాడు. వారు భయంతో తికమకపడ్డారు.

"మీరు ఆశ్చర్యపడవద్దు; భయపడవద్దు" బ్రతికి ఉన్నవారు సమాధిలో ఎందుకు ఉంటారు ? నజరేతు వాసియైన ఏసును గదా మీరు వెదకుచున్నారు ? ఆయన ఇక్కడలేడు. దేవుడు ఆయనను బ్రతికించాడు. ఆయన లేచి మీకంటే ముందుగా గలిలయ వెళ్ళాడు. మీరు వెళ్ళి ఈ సంగతి, ఆయన శిష్యులగు పేతురు మొదలగువారికి చెప్పండి. ప్రభుకుమారుడు మొదటనే మీకు చెప్పినాడు గదా ! "మానవుడుగా వుట్టినవానిని (ఏసును) జనం రోమా ప్రభుత్వానికి అప్పగించి నప్పుడు, వారు ఆయనను సిలువ వేస్తారనీ, మూడవనాడే తిరిగి ఆయన సమాధి నుండి లేస్తానని చెప్పాడు గదా ! మీకు గుర్తు లేదా ?" అని ఆ తెల్లని అంగీ యువకుడు వారిని అడిగాడు. వారికి ఆ మాటలతో "ఏసు పూర్వం చెప్పినమాటలు" గుర్తుకు వచ్చాయి.

ఆ స్త్రీలు, యోసేపు వెంటనే సమాధి నుండి వెనుకకు తిరిగి వెళ్ళారు. తాము చూచిందీ, సమాధిలో జరిగిందీ సర్వమూ ఏసు శిష్యులు 11 మందికి తెలియ జేశారు. 12వ వాడు వారికి కన్పించలేదు. తర్వాత వారికి 12వ వాడైన ఇస్కారియేతు యూదా సంగతి తెలిసింది.

లంచంగా యిచ్చిన 30 వెండినాణెలతో ఇస్కారియేతు పొలం కొన్నాడనీ, అది పండుట లేదనీ - అందువలన అతడు విచారంతో ఆత్మహత్య చేసుకున్నాడనీ వారికి తెలిసింది.

## ఏసు శిష్యులకు ప్రత్యక్షమగుట

స్త్రీలు, యోసేపు వచ్చి - పేతురు మొదలగు శిష్యులకు ఏసు సంగతి చెప్పుటకు ముందుగానే ఏసు తన 11 మంది శిష్యులు భోజనం చేస్తున్నప్పుడు ప్రత్యక్షమయ్యాడు. వారందరూ విభ్రాంతి చెందారు ; "భూతం" అని భయపడిపోయినారు.

వారందరు అక్కడవరకు వచ్చాక - ఏసు వారిని దీవించుటకు చేతులు పైకెత్తగా ఒక మేఘము అలముకొంది. ఆ సమయంలో ఏసు పరలోకానికి వెడలి పోయాడు.

శిష్యులు మేఘము తప్పుకోగానే ఒక దేవదూత కనబడి యిలా వారికి బోధించాడు.

"ఎందుకు ఏసుకొరకు చూస్తున్నారు ? ఏసునందు విశ్వాసం ఉంచిన వారి కొరకు, మన అందరికొరకు తిరిగి రాగలడు. మీరు మీ జీవితములను బాగుచేసి కొనుడు లోకమును పరిశుద్ధాత్మతో బాగుపరచుడు"అని చెప్పి మాయమైపోయాడు.

## చివరి మాటలు

ప్రభువైన ఏసు పరలోకంలోకి వెళ్ళిన తర్వాత దేవునియొక్క సింహాసన మందు కుడిప్రక్కన కూర్చున్నాడు. అటునుండియే తన యొక్క శిష్యులను ఆశీర్వదిస్తాడు.

దేవదూత వెళ్ళిన మీదట 11 మంది శిష్యులు వెళ్ళి దేశమంతటా "ప్రభు సందేశాన్ని" ప్రకటించారు. ప్రభువు వారిని వెన్నంటియే యున్నాడు. వారు చేసే అద్భుతాలను యదార్థము చేశాడు.

నిత్యరక్షణ కలుగజేయునదియు, పవిత్రవంతమైనదియు, శుభసందేశం గల్గునదియు అగు శ్రీ ఏసుయొక్క ప్రకటనలను శిష్యులు దేశం నలుమూలల వ్యాపింపజేసి - తరించారు; ప్రజలను తరింపజేస్తున్నారు.



# విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు
## (సరళ సులభ శైలిలో వ్రాయబడినవి)

ఇంగ్లీష్ – తెలుగు డిక్షనరి

తెలుగు – ఇంగ్లీష్ డిక్షనరి

హిందీ – తెలుగు డిక్షనరీ

తెలుగు నిఘంటువు

త్రిభాషా డిక్షనరీ

తెలుగు – హిందీ డిక్షనరి

ఇంగ్లీష్ – ఇంగ్లీష్ డిక్షనరి

ఇంగ్లీష్ – హిందీ డిక్షనరి

హిందీ – ఇంగ్లీష్ డిక్షనరి

రసాయన శాస్త్రము డిక్షనరి

జంతుశాస్త్రము డిక్షనరి

వృక్షశాస్త్రము డిక్షనరి

కణితశాస్త్రము డిక్షనరి

ఇంగ్లీష్ వ్యాసాలు – లేఖలు

హిందీ వ్యాసాలు – లేఖలు

తెలుగు వ్యాసాలు – లేఖలు

ఇంగ్లీష్ గ్రామర్

హిశది గ్రామర్
(హైస్కూల్ స్టూడెంట్స్)

హిందీ గ్రామర్ (డిగ్రీ స్టూడెంట్స్)

త్రిభాషా వ్యాకరణం

తెలుగు వ్యాకరణము

సులభ వ్యాకరణము

45 రోజుల్లో ఇంగ్లీష్

ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని

హిందీ తెలుగు స్వబోధిని

గణితం ఒలింపియాడ్ – తెలుగు

గణిత ఒలింపియాడ్ – ఇంగ్లీష్

గణిత సూత్రములు

గణితము – సమస్యలు – సాధనలు

ప్రాథమిక గణిత శాస్త్రస్వబోధి

అంకగణితం

గణితశాస్త్రం – (బీజగణితం)

101 స్వయం ఉపాధి పథకాలు

ఫోటోగ్రఫీ నేర్చుకుందాం

తెలుగు సామెతలు

ఇంగ్లీష్ తెలుగు సామెతలు

మీ ఆంగ్ల పదజాలం
పెంపొందించుకోండి

101 జోక్స్–జోక్స్–జోక్స్

# బాల సాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా (2 భాగాలు)
బాలానంద బొమ్మల అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
బాలానంద బొమ్మల బైబిల్ కథలు (2 భాగాలు)
బాలానంద బొమ్మల సింద్‌బాద్ సాహస యాత్రలు
బాలానంద బొమ్మల రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
బాలానంద బొమ్మల డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
బాలానంద బొమ్మల రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
బాలానంద బొమ్మల రెండు మహానగరాల కథ
బాలానంద బొమ్మల డేవిడ్ కాపర్‌ఫీల్డ్
బాలానంద బొమ్మల ఆలివర్ ట్విస్ట్
బాలానంద బొమ్మల రాజు — పేద
బాలానంద బొమ్మల ప్రపంచ అద్భుత కథలు (2 భాగాలు)
బాలానంద బొమ్మల పంచతంత్రం
బాలానంద బొమ్మల రామాయణం
బాలానంద బొమ్మల భారతం
బాలానంద బొమ్మల భాగవతం
బాలానంద బొమ్మల దశావతారాలు
బాలానంద బొమ్మల పల్నాటి వీరచరిత్ర
బాలానంద బొమ్మల జై వీరహనుమాన్
బాలానంద బొమ్మల నవగ్రహ పూజా మహిమ
బాలానంద బొమ్మల శ్రీకృష్ణలీలలు
బాలానంద బొమ్మల టిప్పుసుల్తాన్
బాలానంద బొమ్మల వీరబ్రహ్మేంద్ర కాలజ్ఞానం
బాలానంద బొమ్మల మర్యాదరామన్న కథలు
బాలానంద బొమ్మల అల్లావుద్దీన్ అద్భుతదీపం
బాలానంద బొమ్మల ఆలీబాబా 40 దొంగలు
బాలానంద బొమ్మల అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
బాలానంద బొమ్మల భేతాళ కథలు
బాలానంద బొమ్మల తెనాలి రామకృష్ణ కథలు
బాలానంద బొమ్మల పరమానందయ్య శిష్యులు
బాలానంద బొమ్మల భట్టి—విక్రమాదిత్యుల కథలు (2 భాగాలు)
బాలానంద బొమ్మల అపూర్వ చింతామణి
బాలానంద బొమ్మల కాశీ రామేశ్వర మజిలీల కథలు
బాలానంద బొమ్మల గలివర్ సాహస యాత్రలు